# అరుణతార

సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక

"యువకులు పెదవులపై మందహాసం చిందిస్తూ అత్యంత అమానుష హింసలనుకూడా భరించగలరు. ఏ విధమైన సంకోచం లేకుండా మృత్యువు కళ్ళల్లోకి చూడ గలరు. ఎందువల్లంటే మానవాభ్యుదయ చరిత్ర సమస్తం యువతీయువకుల రుధిరంతోనే లిఖించబడింది."

మార్చి
1990



118

మార్చి 23 భగత్‌సింగ్ వర్ధంతి

"విప్లవం అంటే మన నిర్వచనం యిదీ! ప్రస్తుత సామాజిక వ్యవస్థను కూకటివేళ్ళతో పెళ్ళగించివేయాలి. ఇందుకు రాజ్యాంగ యంత్రాన్ని స్వాధీనం చేసుకోవటం అత్యవసరం."

"విప్లవం ప్రపంచ నియమం. అది మానవాభ్యుదయ రహస్యం. కాని ఆ విప్లవంలో రక్తపాతంతోకూడిన సంఘర్షణ అనివార్యం. అందులో వ్యక్తిగతహింసకు ఎలాంటి స్థానంలేదు"

2

# విషయసూచిక

సంపాదకీయం

# రైతాంగం కదుల్తోంది

బూర్జువా పార్టీలకు రెండేసి ముఖాలుంటాయి. అధికారంలో ఉన్నప్పుడు ఒక ముఖాన్ని చూపిస్తాయి. అధికారం లేనప్పుడు మరో ముఖాన్ని చూపిస్తాయి. ఇటీవలి ఎన్నికల్లో రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలు మారినప్పుడు ఈ విషయం మరోసారి రుజువయింది.

రాష్ట్రానికి సంబంధించినంతవరకు 1983 లో తొలిసారిగా కాంగ్రెసేతర ప్రభుత్వం ఏర్పడి ఎన్టీఆర్ అధికారంలోకి వచ్చినప్పుడు అది మనకు మొదటి అనుభవం. ఉద్యోగుల సమస్యల్ని పరిష్కరించలేని ప్రభుత్వం ఒక ప్రభుత్వమా అని 1982లో కాంగ్రెస్‌ని ప్రశ్నించిన ఎన్టీఆర్ 1983 లో అధికారంలోకి వచ్చింతర్వాత ఉద్యోగులకు సమ్మె చేసుకునే హక్కునుకూడా లేకుండా చెయ్యడానికి ప్రయత్నించాడు. అంతవరకూ ప్రజా వ్యతిరేక పరిపాలన కొనసాగిస్తూ ప్రజల్నే మర్చిపోయిన కాంగ్రెస్‌పార్టీ ఒక్కసారిగా ప్రతిపక్షంలోకి వెళ్ళేసరికి ప్రజల్ని గుర్తుకుతెచ్చుకుని వారి తరపున మాట్లాడ్డానికి లేని అలవాటును చేసుకోవలసివచ్చింది. దేశానికి రైతన్నే వెన్నెముక అనీ, రైతురాజ్యం స్థాపించాలనీ అధికారం లేనప్పుడు మాట్లాడిన ఎన్టీయార్ అధికారంలోకి రాగానే ముగ్గురు పొగాకు రైతుల్ని పోలీసు కాల్పులలో పొట్టనబెట్టుకున్నాడు.

మొన్నటి ఎన్నికల్లో రాష్ట్రంలో కాంగ్రెస్‌పార్టీగానీ, కేంద్రంలో నేషనల్ ఫ్రంట్‌గానీ అధికారంలోకి వస్తాయని ప్రజలతోబాటు ఆ పార్టీలూ పెద్దగా ఊహించి వుండవు. ఆ భరోసాతోనే ఏమో ఇద్దరూ వాగ్దానాల్ని కురిపించారు. ఎవ్వరూ వాటిని నిలబెట్టుకోలేకపోతున్నారు. ఉదాహరణకు నీటితీరువా పన్ను ఎకరాకి 40 రూ. ఉంటే తెలుగుదేశం ప్రభుత్వం దాన్ని 80 రూ.కు పెంచింది. రైతులలో పెద్దయెత్తున నిరసన వచ్చింది. అప్పుడు కాంగ్రెస్‌పార్టీకూడా దాన్ని వ్యతిరేకించింది చివరకు 40 రూ. లెక్కనే నీటి తీరువా పన్ను కట్టించుకున్నారు. ఇప్పుడు అధికారంలోకి వచ్చిన కాంగ్రెస్ 80 రూ. లెక్కన కట్టమంటోంది. ఇప్పుడు తెలుగుదేశం ప్రతిపక్షంలో ఉంది కాబట్టి రైతుల్ని సమీకరించడానికి ప్రయత్నిస్తోంది

నేషనల్ ఫ్రంట్ నాయకులు ఎన్నికలకు ముందు 10 వేల రూపాయల లోపు ఉన్న రైతుల అప్పులను రద్దుచేస్తామని హామీ యిచ్చారు. అధికారంలోకి

వచ్చింతర్వాత దాని అసలు విషయం పట్టించుకోవడమే లేదు. పట్టించుకున్నా చేసిన వాగ్దానాలకు ఇరవయ్యారు సవరణలుచేసి, తొంభైయారు పరిమితులు విధిస్తున్నారు. ఆనాడు ఎన్నికల్లో గెలవడంకోసం ఇచ్చిన హామీల్ని నిలబెట్టుకోడానికి ఇవాళ చేతగాక చతికిలబడతోంది నేషనల్ ఫ్రంట్. దీన్ని ఆసరా చేసుకుని అధికారంలోకి రాజూస్తోంది కాంగ్రెస్. ఇది బూర్జువా పాలకవర్గాల (అధికార, ప్రతిపక్ష పార్టీల) స్వభావం.

ఇటీవల వడగండ్ల వానవల్ల అనేక జిల్లాల్లో పంటలు దెబ్బతిన్నాయి. ఎరువులు, మందులు రేట్లు పెరిగిపోయాయి. ఎక్కువ భాగం చెరువుల్లో నీళ్ళు లేవు. పైగా కరెంటుకోత గోరుచుట్టుపై రోకటిపోటులా తయారయింది పెరిగిన రైలు చార్జీలు, పెరగనున్న బస్సు చార్జీలు, నిత్యం పెరుగుతూ వున్న నిత్యావసర వస్తువుల ధరలు సన్నకారు, మధ్యతరగతి రైతులు, రైతుకూలీలు ఇతర సామాన్య ప్రజలు ప్రధానంగా ఈ కష్టాల్ని భరించాలి. వీటన్నిటికీ తోడు రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు రెండూ లోటు బడ్జెటులను ప్రవేశపెట్టాయి. ఆ లోటును తీర్చుకోవడానికి ఈ ప్రభుత్వాలు పేద ప్రజలపైనే భారంవేస్తాయి అంతేగాని లక్షలు కోట్లు అక్రమంగా సంపాదిస్తూ, నల్లధనాన్ని పెంచుకుంటూ ఆదాయపు పన్ను ఎగ్గొట్టే పెద్దపెద్ద పెట్టుబడిదారులనుండీ, బడా భూస్వాముల నుండీ, సారా కాంట్రాక్టర్లనుండీ, పెద్దవ్యాపారులనుండీ, సినీ నటులనుండీ రావలసిన డబ్బునుమాత్రం రాబట్టవు. ఎందుకంటే పరోక్షంలో వీళ్ళే ఈ పాలకవర్గాల్ని పోషిస్తుంటారు కాబట్టి.

ఆమధ్య ప్రకాశం, గుంటూరు జిల్లాల్లో పత్తిరైతులు ఆత్మహత్యలు చేసుకుంటున్నప్పుడు ఈ ప్రభుత్వాలు ఏమీ చెయ్యలేక అవే ఆత్మహత్య చేసుకొన్నట్టయింది. మహబూబ్‌నగర్ జిల్లాలో ఆకలిచావులు సంభవిస్తుంటే కోట్లాది రూపాయలు ఖర్చుపెట్టి టాంక్‌బండ్‌పైన విగ్రహాలు పెట్టారు. అయిదున్నర కోట్ల రూపాయల ఖర్చుతో ప్రపంచంలోకెల్లా పెద్ద బుద్ధ విగ్రహాన్ని ప్రతిష్ఠించబోయి దాన్ని హుస్సేన్‌సాగర్‌లో ముంచేశారు. ఆ డబ్బు పెట్టి వందలాది చెరువుల్ని రిపేరు చేయించవచ్చు. ఆ పని చెయ్యరు. పెద్దపెద్ద కట్టడాలు నిర్మించడం తప్పుకాదుగానీ, ప్రజల రక్తాన్ని పిండి, ప్రజల డబ్బుతో వాటిని నిర్మించి ప్రజలు ఏమైపోయినా తాముమాత్రం గిన్నిస్ బుక్‌లోకి ఎక్కాలనుకోవడం రాక్షసానందమే తప్ప మరొకటి కాదు. "నా బుద్ధదేవుణ్ణి రక్షించండి" అంటూ గగ్గోలుపెట్టే ఎన్టీయార్‌కు ఆ బుద్ధ విగ్రహం కిందపడి మరణించినవారి కుటుంబాలుగానీ, దేశంలోని అశేష పీడిత ప్రజానీకంగానీ కనిపించరు.

కాని ప్రజలు ఎల్లకాలం మోసపోరు. పాలకవర్గాలు తమ స్వభావాన్ని తామే బయటపెట్టుకుంటాయన్న విషయాన్ని ప్రజలుకూడా సులభంగా గుర్తించగలుగుతున్నారు. అందుకే ప్రజల్లో నిరసనభావం ఇటీవలికాలంలో సులభంగా వ్యక్తమౌతోంది. ఉద్యోగులు, కార్మికులు నిరసనలు ప్రకటించడం, సమ్మెలు చెయ్యడం మామూలే. ఎందుకంటే వాళ్ళు సులభంగా సంఘటితం అయ్యే అవకాశం వుంది. అలాంటి అవకాశం తక్కువగా వుండే రైతులుకూడా ఇటీవల ఉద్యమిస్తున్నారు. ధర్నాలు చేస్తున్నారు. ర్యాలీలు తీస్తున్నారు. ప్రజాస్వామిక పద్ధతిలో ప్రభుత్వానికి మెమొరాండాలు సమర్పిస్తున్నారు. ఎప్పుడూ ప్రజాస్వామ్యం ప్రజాస్వామ్యం అని ఊదరగొట్టే ప్రభుత్వాలు తమ ప్రజాస్వామిక స్వభావాన్ని ఏమాత్రం రుజువు చేసుకుంటాయో పరీక్షించే స్థితికి రైతాంగం చైతన్యవంతమౌతోంది. ఎవరు కదిలించినా కదలడానికి సిద్ధమౌతోంది రైతాంగం.

నిధులు లేవనీ, ప్రకృతి వైపరీత్యాలనీ ఏవేవో కల్లబొల్లి కబుర్లు చెబుతారేగాని, ఉన్న ప్రకృతి వనరుల్నీ, ఉన్న నిధుల్నీ సద్వినియోగం చెయ్యాలన్న శ్రద్ధా, చిత్తశుద్ధీ ఉండవు పాలకవర్గాలకు. తమ చెమటను, రక్తాన్ని సంపదగా మార్చే ఈ శ్రమజీవులే దీనికి పరిష్కారం కనుక్కోవాలి, కనుక్కుంటారు.

---

## అమృత భాండం పంచబడుతుంది

—ఎమ్మెన్

వాళ్ళు ఒంటరిగా లేరు
పీడిత ప్రపంచం వెంటరాగా, అగ్రభాగాన నిలిచి
విజయపథంలో మార్చింగ్ చేస్తున్నారు
వారి గమనం మార్చాలని, కాంతి నిర్వీర్యం చేయాలని
హాలాహలుని కెంత కోరిక!
కానీ... వాళ్ళు కాంతితో భాసిస్తారు, మేఘాలమధ్య దూసుకువస్తారు
అదృశ్యం అనుకున్న తక్షణం తూర్పున ఉదయిస్తారు
నిత్యనిర్బంధంలో కొత్త మార్గాలు అన్వేషిస్తారు
మట్టిని చీల్చి మార్గాలు వేస్తారు
వారి చూపుల తీక్షణతకు గాలితెరలు వేడెక్కుతున్నాయ్
అడవులు సెగలు కక్కుతున్నాయ్, సముద్రాలు సుడులుతిరుగుతున్నాయ్
సాగరమథనం జోరుగా సాగుతోంది
హాలాహలం ఛేదించబడుతుంది - అమృతభాండం పంచబడుతుంది
చారిత్రక యథార్థ సత్యం త్వరలో విశదమవుతుంది.

# సాక్ష్యం

అర్ధరాత్రి... నడి రోడ్డులో... గుర్తుతెలియని శవం
ఏ తల్లి కన్నదో! ఏ తండ్రి పెంచినదో!
మెదడును తొలిచేసే ప్రశ్నలు
ప్రశ్నల పరంపరను నిద్రలేపే ఆ శవం ఏ అభాగ్యజీవిదో!
కారుచీకట్లో నిర్మానుష్యమైన ఓ రోడ్డూ!
నిర్మానుష్యమైన రోడ్డుపైన పరుచుకున్న ఓ కారుచీకటీ!
ఆ చావుకు సాక్ష్యం మీరయినా చెబుతారా?
ఉరికి కరెంటుస్తంభం అయితేనేం సీలింగ్‌ఫ్యానైతేనేం
శవం వేలాడడం వాస్తవం
కానీ... ఉరులు పన్నిన ఆ చేతులు ఎవరివి?
ఎప్పుడైనా.... ఎవరికైనా అమ్మలా ఆదరించే ఓ పచ్చదనాల పార్కూ!
నువ్వయినా చెప్పు ఆ చావుకు సాక్ష్యం
ఏదీ అసాధ్యంకాని నాదేశపు ఖాకీ వ్యాఖ్యాదల కథనంలో
ఏ శవమైనా తననుతాను దిగంబరం చేసుకుంటుంది
తన మెడకు తానే ఉరితాడు బిగించుకుంటుంది.
ఆరాత్రి ఎంత భయంకర విహ్వలత్వాన్ని చూసిందో
బతుకదలచుకున్న వారెవరయినా నమ్మేలేరారి ఆ కథనాలను
జీవితంపట్ల చావని ఆశ చనిపోయిన శవాల ముఖాల్లో చూడు
జీవచ్ఛవాల ముఖాల్లో గూడుకట్టుకున్న భయాల్లో చూడు
మరి ఆ జీవనాకాంక్షలను చిదిమేసినదెవరు?
ఆ మొగ్గలను రాల్చేసినదెవరు?
శవాన్నే అడుగుతాను సాక్ష్యం, ఉరితాడునడుగుతాను సాక్ష్యం
చెట్టునడుగుతాను, పుట్టలనడుగుతాను
గాలినడుగుతాను, నింగినడుగుతాను
చావుకూ బతుక్కూ, చావుబతుకుల పోరుకూ, పోరుసాగేతీరుకూ
సజీవసాక్షి - మరణంలేని నా నగర చరిత్రనడుగుతాను సాక్ష్యం
అకాలమరణాలెందుకని, అసహజమరణాలెందుకని
భవిష్యత్తీరాలకు ప్రవాహమై సాగిపోయే
కాలాన్నడుగుతాను సాక్ష్యం!

—రజని

# నీకు బిడ్డనైనందుకు....

—అరవింద్

నాన్నా! మామిడిచెట్లు గాలితో కబుర్లాడేవేళ మలినంకాని వెన్నెల్లో, నీవు క్వార్టర్స్ చుట్టూ జీపులో 'రౌండ్స్' కొట్టినపుడు-ఓహ్! ఛాంపియన్‌షిప్ కొట్టిన హైస్కూలు కుర్రాడిలా ఉత్సాహం వరదలై కన్పించేవు.

ఆరోజు మీ ఆఫీసర్లంతా జల్సాచేసినపుడు నీకేదో ప్రమోషన్ అని ఊహించి, నా భవిష్యత్తుమీద పసిడికలల్ని పర్చుకున్నాను క్రోటన్ మొక్కల మధ్య వెన్నెల తృళ్ళింతలు పడటం నేనారోజు కళ్ళారా చూశాను.

ఆ తర్వాత తెల్సింది- నీ కళ్ళల్లో వెల్తురు పదిమందికీ చూపునిచ్చేది కాదనీ, అది చిందించిన నెత్తుటితైలంతో వెల్గిందనీ, నీవు నిద్రించే మనుష్యుల్ని దీర్ఘనిద్రలోకి పంపి ధీరోదాత్తుడివయ్యావనీ, నీకు ప్రాణాలు తీయడమంటే 'యాటల్ని' పడేయడమనీ ఊపిర్లను తెంచడంలో నీ ఉత్సాహం జూసి, కళ్ళ ముందు దృశ్యాలు ఎడారిపాట విన్పించాయి. కరిగిపోయిన ఊహలు వికృతపు శిశువు ఏడ్పును ధ్వనించాయి.

ఆ తర్వాత మనింటిలోకి నడిచొచ్చిన ప్రతి సౌఖ్యమూ నాకు జలదరింపే అయింది ఈ కర్టెన్ ఖరీదైనదీ, కళావంతమైనదీ కావచ్చు, కాని, నాకిది మనిషి చర్మం వాసనేస్తుంది. స్పర్శిస్తే పలుకరిస్తుందేమో, ప్రశ్నిస్తుందేమో ననే భయం. ఈ మెత్తటి సోఫామీద కూర్చుంటే నాకు శవంమీద కూర్చున్న అనుభూతి. అమ్మ మెళ్లో రవ్వల నెక్లెసు నాకు మచ్చాలపాములా అన్పిస్తుంది అసలు నీ భుజంమీద మొల్చిన చుక్కకి నెత్తురోడే గుండెలు వేలాడుతున్నాయి చూడు.

నాన్నా! ఇంత కుమ్మించి నీవు సాధించిందేమిటి? నా కళ్ళలోకి సూటిగా నవ్వలేవు పక్కవాళ్ల ఇళ్ళకైనా పిస్టల్ లేకుండా వెళ్ళలేవు. నీ ప్రతి కదలిక లోనూ తత్తరపాటు, భయం. మన మధ్యన దహించుకుపోయే మాటలోటల్ని ఇంక ఏమాటా, అనుబంధమూ ఆపలేవు.

మృత్యుకెరటంమీద ఓటిపడవను నడిపే నీకు వాళ్ళు వ్యక్తులుగా అగి పోవచ్చుగాని, శక్తులుగా మిగిలే ఉంటారు. జనంలో కనుక్తుంటారు. రక్తాల్ని మండించి మంచుఎడార్లలోసైతం మంటల్ని పుట్టిస్తారు. వాళ్ళ ఉనికీ, కదలికా ఆద్యంతమూ ఓ రాయలేని కావ్యం.

మీరు రక్తాల్నితోడేసి కపాలాలమీద న్యాయసూత్రాల్ని రాస్తారు. చిత్రహింసల పర్వంలో చిరునామాలు చెక్కుతుంటారు. బతుకుమీద క్యాన్సర్ పుండులా మిగిలి ఉంటారు. అందుకేనేమో మొదట నువ్వంటే నాకెంతో ప్రాణమే. ఇప్పుడు నువ్వు తెలిశాక నీ నవ్వులవెనుక తారాడే బీభత్సం చూశాక నీ ఉనికే నాకసహ్యం. నీ బిడ్డనైనందుకు నామీద నాకే ... ఛ ....

ఇట్లు,
ఒక కొడుకు.

# కొత్త చిగురు

అసత్యం కెరటాలమీద వించొని ప్రమాణాలు చేస్తున్నాడు
మీ హక్కుల పిచ్చుగ్గూళ్ళకి నేనుకాపలా అని ఒడ్డును తాకి ఒట్టుపెడుతున్నాడు
వేటతపకంలో మత్తెక్కిన జాగిలమౌతున్నాడు
తుపాకుల చెట్లకింద కామధేనువులు కట్టుకొమ్మంటున్నాడు
వాగ్దానాలకత్తులకి లొంగుబాటు తేనెపూస్తున్నాడు
వాటికి కంకణాలు కట్టిన శుభముహూర్తంలోనే
రాజకీయ వైధవ్య పించనిస్తానని బాజాలు వాయిస్తున్నాడు
గుండెకుపోయే నెత్తుటిదారుల్ని మూసేయాలని ప్రయత్నిస్తూ
'సెల్యూలాయిడ్' స్వర్గాన్ని సృష్టిస్తానంటూ
నక్షత్రధూళితో చీకటిలో కాలు చెక్కుతున్నాడు.

**2**

గోళ్ళూడే ముసలిపులి ఆశల పూబిలోకి ఆహ్వానిస్తూంది.
ముందుకాళ్ళకి స్వర్ణకంకణ బంధంపేయాలని చూస్తూంది
శ్వాసించే గొంతులమీద సమాధులుకట్టే ఊసరవెల్లి కాసేపు రంగుమారుస్తూంది
అసహ్యైన 'హైడ్' పునాదుల్ని తవ్వేస్తూంటాడు
రాజకీయ 'జాకర్' స్తూపాలకి కాంక్రీటు వేస్తానంటాడు.

**3**

వాడు
పచ్చటి అడవుల చుట్టూ 'ఊదర' పెట్టి చలికాచుకుంటాడు
ఆశయాలకుప్పలు తగలెట్టి పిడికెడు పేలాలు దానంచేస్తాడు
కొండనాలికా పున్నానాలికా తెగ్గోసి తన్లోని వాక్కు మన్లోకి 'డ్రైవ్' చేస్తాడు.

4

గాయాలైనా చెట్లు పుష్పిస్తూనే వుంటాయి
శిథిలమైనా స్తూపాలు త్యాగాల్ని శ్వాసిస్తూనేవుంటాయి
కొమ్మలు విరిగినా కొత్తచివుళ్ళు తొడుగుతూనే వుంటాయి
చెట్లు ఎదుగుతూనేవుంటాయి - ప్రాణవాయువు అందిస్తూనే వుంటాయి.

—ఎ. కె. ప్రభాకర్

# రూపురేఖలు

కోళ్ళగూడసొంటి పెయ్యిమీద బరిబద్ద బొక్కలే కనపడుతున్నాయి
సాటు చేసుకుంట అంగి పేజమా ఉన్నది
దానికింద పైంటు జారిపోకుంట తాడొసంటి బెల్టు బిగిచ్చున్నది
కాళ్ళసెప్పులకైతే పైంటుకున్నన్ని అతుకులు కనపడుతున్నాయి.
జబ్బకెమో నేను నాటుసరకునే అన్నట్లు కిందిదాక యేల్లాడుతోంది ఓటుపాకి
కిట్టును చూడబోతే గొట్టోల్లు బెంగాళీలకాడ కొన్న అంగిలెక్కున్నది
నెత్తి ఎంటుకలైతే ఎదురులేనట్టున్నవి, మీసాలు మాత్రంఎపలకు కమ్మిలేవు
దొచ్చె ఎండిపోయినగానీ మొఖం కొట్టొచ్చినట్టున్నది
ఆడోళ్ళగూడ ఏక్, దో అంటాండ్రు - ఏందంటే కసరత్తు అనపట్రి
నన్నెపలని అడిగితే ఇగ నేను ఉన్నదున్నట్టు చెప్పేవరకు
నా సుట్టు ఈగలోలె ముసిరి సీలంకకెళ్ళి దునియాబార్ కొలుపు చేసిరి
నేను పేపర్లల్ల రాత్త ఏమన్న చెప్పుండ్రంటే—
ఈ దండకారణ్యం మాదంటుండ్రు, ఈడున్నోల్లందరూ మావోళ్ళేంటారు
ఏది పోనియ్యకుంట
ఆకు, అలము, గడ్డ, బెడ్డ, పట్టకొక్కు, ఎదురుకొయ్య
చీమలు, పాములు, కప్పలు, ముంగీసలు, ఉడుతలు
అఖరుకు పందికొక్కులగూడ ఇడువక తింటమంటుండ్రు
అల్లంపెల్లి, దారగడ్డైతే అయినయి, అచ్చేది ఎండకాలం, ఆకుల సీజను
ఏడుకొండలోనికి నిండుదోపిడిచ్చినట్టుంటుంది ఈ అడవితల్లి యవ్వారం
గిదే సందనుకొని మందలోలె అత్తరు అని చెప్పుతున్న అండ్ల పెద్దోడు
పయిలం బిడ్డా! పయిలం అని చెప్పే పేదోల్ల ముచ్చట అండ్ల ఇరికిచ్చిండు
గిట్ల జనంల కలిసి, అడవిల కలిసి
బతుకే మమ్మల మీది రథాలు పెంచేస్తయి

మిలట్రోడు ఏంచేస్తడు - ఉంటే ప్రాణం, పోతే ప్రాణం
జనంలున్నోనికి జనమే ప్రాణం
బిగిచ్చిన పిడికిలెత్తి పాటకూడ పాడిండు
నిజంగా ——
కొట్లాడాలంటే గిట్లే కొట్లాడాలి, కోరుకునేదేదో గిట్లే గెలవాలి
ఇడిపోయేపుడు నాగుండె చెరువయ్యింది
మళ్ళీ ఎప్పుడో.... ఇగ ఎక్కడో....

—'వ్రతకార'

# వాళ్ళకు మృత్యురహస్యం తెలుసు

అది
శవాల్ని మోసేవాళ్ళకి తెలీదు, శవాల్ని కోసేవాళ్ళకి తెలీదు
శవాల బేహారులకీ తెలీదు
కళ్ళలోని కాంతుల్నీ, పెదవి భూమ్మీద చిరునవ్వుల వసంతాల్నీ
క్రమంగా పీల్చేసేవాళ్ళకీ తెలీదు
పుస్తకాల దొంతర్ల కింద చెదలుపట్టిన మెదళ్ళకీ తెలీదు
ద్వైతాలూ, అద్వైతాలూ, సకల పారలౌకిక సూత్రాలూ
వల్లించి నిద్రబుచ్చే పరబోధకులకీ తెలీదు
అది
గాఢ సముద్రాలను గాలించి
ఆశయాల ఆణిముత్యాలను సాధించిన వాళ్ళకి తెలుసు
లోయల్లో మినుకు మినుకుమంటున్న కళ్ళను శిఖరాగ్రందాకా పాకించి
విశాలాకాశాన్నీ, ఉరుకులెత్తే నదీజల ప్రవాహాల్నీ
తూర్పుగుండెమీద ఉదయగీతం రాసే సూర్యుణ్ణీ
పరిచయం చేసే వాళ్ళకి తెలుసు
తుఫాను ఒడిలో పుట్టి, తుఫానుల్తో సహచరించి, మృత్యువుపక్కనే నడుస్తున్నా
చివరిదాకా ధిక్కారగీతాల్ని దిక్కుల్నిండా చల్లినవాళ్ళకి తెలుసు
లాఠీదెబ్బల్నీ, తుపాకీగుళ్ళనీ, అలసటనీ, చెమటనీ, గాయాల్నీ
బతుకుపాఠాలుగా స్వీకరించి, చరిత్రను వెన్నుమీద మోసేవాళ్ళకి తెలుసు
అది
మొరైసీకి తెలుసు, అల్లూరికి తెలుసు, భగత్‌కి తెలుసు

రాయలింగుకి తెలుసు, అయిలయ్య రాజమల్లులకి తెలుసు
వాళ్ళ వారసులకు తెలుసు
మృత్యువంటే క్రూరమైనదని తెలిసీ, మృత్యువంటే అగాధమని తెలిసీ
నిస్సంకోచంగా మృత్యువును కౌగలించి
తమ మృత్యువుద్వారా చరిత్ర నడవవల్సిన గమ్యాలను సూచించిన
యోధులందరికీ తెలుసు మృత్యురహస్యం
వాళ్ళకి మృత్యువంటే జీవితానికి చివరి అంచు కాదనీ
మృత్యువంటే తుపాకి భుజం మార్చడమేననీ
స్పష్టంగా తెలుసు.

—ఉదయమిత్ర

# భరోసా

మనస్సు మరుభూమిలా వుండి మాటలు దెయ్యాలై వేటాడుతున్నపుడు
పోరాడే మనిషి జెండాగా ఎగిరే మీ కవితలూ కథలూ
వెలుగూ వెచ్చదనమూ కురిపిస్తాయి
నెర్రెలువారి పడావుపడ్డ చేనులా ఒంటరితనం బావురుమన్నప్పుడు
ధృవతారలా వెలుగులీనుతూ మనస్సును హోరెత్తించే మీ అమరగానం
గింగుర్లెత్తి గిరికీలు కొట్టిస్తుంది
చూస్తూవుండగానే కళ్ళముందు కాలం కరిగిపోతూవుంది
అయ్యో ఏం చేస్తున్నాం ఎంతకాలం యిలా అనిపించేటప్పటికల్లా
అదుగో దండకారణ్యంలో తెలంగాణాలో
తెగిపడే శత్రువు తలలూ ద్రోహుల కాళ్లెక్కలూ
మంటల్లో మాడిమసైపోతున్న ఆ పేగులూ ఆస్తులూ
వేకువతెచ్చే వెలుగురేకల్లా వెన్నుతట్టి చిరునవ్వుచిందిస్తాయి.
హెలికాప్టర్లూ పెంపుడుకుక్కలూ గూండాలకి తుపాకులూ
కాల్మొక్కితే కట్నకానుకలూ, అపీయిపీ దిబ్బాదిరుగుండం అంటూ
ఆరాటపడి అలిసిపోతున్నాడు వాడు
అన్నా తంబీ అంటూ అంతా ఏకమై విరుచుకుపడిపోతున్నారు
పట్టపగ్గాల్లేకుండా పేట్రేగిపోతున్నారు
వీళ్ళపని పట్టడం ఎలా అనేసరికల్లా డైనమైట్లుపేలాయి
జీపులు తునకలై తలలూ మొండేలూ చెల్లెక్కాయి

అంటూ పేపర్లో హెడ్డింగుల ప్రకంపనాలు
కవాతు చేసే ఎర్రనక్షత్రాల టోపీలబారులా
ఎదురై ఖంగారేఁలేదు కానుకోమను యీసారి
అంటూ భుజంతట్టి భరోసా చెప్పేయి.
కొమరంభీమూ అల్లూరీ మదిలోమెదిలి
కలిసిరాని కాలం జ్ఞాపకాలు కలుక్కుమన్నప్పుడు
కాలం మారుతూనేవుంది మరో పదిలెక్కెడితే యిరవయ్యొకటి
యిప్పుడు మూడో ప్రపంచయుద్ధం ముంగిట్లోకొచ్చేసేం
నువ్వు నిలుస్తానన్నా నిలవనివ్వదు కాలం
అటో యిటో తేల్చుకోక తప్పదు యీతరం
అందుకే ఆదిలాబాదు నుండి అస్సాం వరకూ అడివంతా ఒకచే అగ్గి
జార్ఖండో గూర్ఖాలాండో నాగాలాండో అన్నిటికీ ఒకేదారి
అందుకే గోండులు మొదలుకొని కోందులవరకూ
దండకారణ్యం అంతా ఒకే దండు అయింది
ఎర్రకోటకి విల్లంబులు ఎక్కుపెట్టి మైదానాల్తో కదంకలిపి కదుల్తావుంది
అంటూ ఆదివాసీసమాఖ్యవార్త చెవులసోకింది
అవును
అడివి అగ్నిశిఖలావుంది
తెలంగాణా పొగలు జిమ్ముతూంది
మైదానాలు నివురుగప్పి నిప్పులావున్నాయి
దేశం దేశమే మొత్తంగా కుమ్ములోపెట్టిన దుంపలా ఉడికిపోతూంది
చావుబతుకుల సంధిలో పడ్డాడు వాడు
అందుకే బరితెగించి బరిమీదికొచ్చేసేడు
ఇక యీసారి వదిలిపెట్టేదిలేదు
వాడి చావు మన విజయం ఖాయం.

—నాగన్న

# ప్రతిధ్వనించే నీ అక్షరాలు

ఒంటరితనాన్ని మరిచి అక్షరాల్ని ప్రాణం చేసుకొన్న కవీ!
నీ సమరం మా కోసమేగా!
మా మనోతంత్రులు సైతం నీ ఆగమనం కోసం విప్లవగీతికల్ని ఆలపించాయి!

భూగోళ శరీరాన్నంతా తడిమిచూసే
నీ అక్షరాలను బ్రతికించుకోవాలనే మా ఆరాటమంతా!
నిత్యం ప్రతిధ్వనించే నీ అక్షరాలు విశాలత్వ సంకేతాలను ప్రతిఫలిస్తాయి!
నీ వినూత్న రక్తసిక్త పదముద్ర ప్రస్థానంతో
ఈ దేశం పీడితప్రపంచం ఇప్పుడిప్పుడే కొత్తచిగురులువేస్తూ మేల్కొంటున్నది!
గడ్డ కట్టిన జనజీవన హిమ సమూహాన్ని
నీ అక్షరసూర్యరశ్మి కరిగించి వెల్లువగా ప్రవహింపచేస్తున్నది!
విజాన్ని నిక్కచ్చిగా తేల్చాలనేకదా నువ్ కలాన్ని కత్తిలా ఝుళిపించింది!
మాకోసం— అక్షర చలినెగళ్ళను చిమ్మించింది
మాకోసం— మరో సముద్రాన్ని, జీవనాడిని సృష్టించింది
మా కోసం— భవిష్యత్ చిత్రపటాన్ని ఆవిష్కరించి,
ఇంకా మేం చూడాల్సిన దృశ్యాల్ని చిత్రించి, పునాదిగోడ నిర్మించింది!
నిజంగా నీ మాట
ఇనుపపాదాల్ని ఎదురించే అడవితల్లి పాడుకొనేపాట!
మాటను మంటగా మార్చిన నీవు, పాటను పిడికిలిగా ఎత్తిన నీవు
మరో ప్రపంచానికి ప్రతిరూపం!
(వరవరరావు జైల్లో ఉన్నప్పుడు రాసిన కవిత)

—మజీద్ షేక్

## కామ్రేడ్ మల్లికార్జున్ స్మృతికి

నీ గుండెలోతుల్లో మానవ ప్రేమను చూశాను
నీ మాటల మెరుపులలో రేపటి సుదూరస్వప్నం కన్నాను
కన్నీటికి కసి చేర్చి, ఏడుపుకు మంటనేర్పి
మిత్రుడా! నీవు పాడిన మృత్యుగీతాన్ని ఆనాడు అర్థంచేసుకోలేకపోయాను
ఇవాళ నువు లేవు....
శత్రువుతో చెలిమి మరిగిన ఆయుధం ద్రోహానికి బలయ్యావు
ఆరోజు అన్నంపెట్టిన ఈ చెయ్యి ఈరోజు నేలమీది నీ రక్తాన్ని తుడిచింది
చెదిరిపడిన ప్రేవుల్ని నువ్వు అరుస్తున్నా, విలవిల్లాడుతున్నా
ఈ చెయ్యి కర్కశంగా పొట్టలోకి తోసింది
ముక్కలైన శరీరాన్ని అతికినా
ప్రాణం నిలుపలేని చెయ్యి, బతుకునివ్వలేని ఈ చెయ్యి

శత్రువారినుండి నీ ఆనవాలు మాత్రం తప్పించింది
ప్రపంచపు నవ్వులో నువు ఏడుపు మరిచావు
ప్రపంచపు ఏడ్పులో నువు నవ్వును విడిచావు
కన్నీళ్ళు ధారపోసి, బాధను ప్రపంచానికై త్యజించి
నిప్పుల కొండకు వెళ్ళిన స్నేహితుడా!
చివరిసారిగా దోసెడు మంచినీళ్ళడిగావు
ఆ నిశిరాత్రి వైఫల్యం నన్ను వెక్కిరించింది
నీళ్ళు పాలకుల మోచేతినే ఆశ్రయిస్తాయని
నీళ్ళు భూమిపొరలు చీల్చుకుని రాకుండా నీ ప్రాణానికి ఎసరుపెడతాయని
నమ్మలేకపోయాను
బంధువు చావుకూ నేను ఏడ్వలేదు, కుటుంబబాధలూ నన్ను కలతపెట్టలేదు
కాని, ఏ వర్గ బంధపుమమతల జడివాన ఈ గుండెల్ని తడిపిందో
ఆ అనుబంధపు కన్నీళ్ళు ఈరోజు ఆగటంలేదు
మిత్రుడా!
నీ రక్తంలో తడిసి నాచొక్కా ధన్యమయింది
నీ రక్తం తుడిచి నా చెయ్యి పునీతమయింది
నీ రక్తం నా రక్తంతో కలిసి విప్లవతోరణాల మాలయింది
ఇరవై వసంతాలు దాటని నీ స్మృతి నా జీవితానికి ఓ సగర్వమైన పిలుపు
నా ప్రాణంలో భాగమా!
నువు మరణించలేదు, నువు బాకీపడలేదు
నా కంటికి వెలుగునివ్వు
నీకోసం జనంలో లెక్కలు తేల్చుకుంటాను.

—కె. రాజశేఖర రాజు

# మానవ హక్కుల ట్రిబ్యునల్‌కు....

తొలకరితో పట్టి జట్టుకట్టే చోట
గిరిమల్లెలు విరబూసిన చోట
ఎర్రబారుతున్న కొమ్మలపై రాబందుల రెక్కల చప్పుడు—
నువ్వు గింజల ముసుర్లకి నాని, ఎండగాడ్పులకు వరుగౌతూ
పుట్టా, చెట్టూ, డొంకా నరికి నేలని సేద్యానికి సుసాధ్యం చేస్తే
'పోడు' అడవిని పాడుచేస్తుందంటూ

వెన్ను బారుగా పేకముక్కల్ని నాటుతూ
'వనమహోత్సవం'లో రాబందుల కూతల అలికిడి—
మనిషెత్తు వెదురుతోపుల్ని నోళ్ళిప్పిన యంత్రాలకు మేతవేస్తూ
ఆకురాలిన జీవితాల చేరుపతో
కనిపించిన ప్రతి కాగితం మీదా రాబందుల కాలిముద్రలు —
కొరడు కట్టించే చలిలో, నలుగురు కూడి చితుకుల మంటల సెగలో
వెచ్చనౌదామంటే పూచల వెలుపల రక్తచందన సింహాసనంలో
రాబందుల హారాహుషార్ —
చెట్టుమీది తునికాకు మానవస్వేదాన్ని తనలో ఇగుర్చుకొని
లారీలకెత్తిన బీడీలకట్టలుగా మారి బస్తీకి దొర్లిపోతుంటే
చిన్నా పెద్దా కుటుంబం అందరి నుదుటి మడతల్లోనూ
రాబందులు రక్కిన జాడలు —
నాగరికసమాజం చెయ్యివిదిలిస్తే రాలిన మెతుకుల్ని
బతుకుపొడుగునా కన్నీళ్ళిచ్చి పుచ్చుకునే వాళ్ళతో పంచుకున్నందుకె
నలుసుపడ్డ కంటిచూపుకి గుడిశంతటి జీవితం భస్మీపటలమౌతుంటే
ఆ సిల్హౌటీ ప్రజాస్వామ్య సన్నివేశంలో, పూర్తి మేకప్‌లో
రాబందుల తకతై నృత్యం —
పాలిపోయిన బొమ్మకి గంతలు కట్టి
ఆర్డర్.... ఆర్డర్.... అని సమ్మెటదెబ్బలు కొట్టే
ఆ (అ) న్యాయస్థానాలకి దూరంగా
తరతరాలుగా బీగాలు వేయబడ్డ నోళ్ళిప్పి
మురిగిన కన్నీళ్ళు స్వచ్ఛందంగా కక్కేద్దామని
అడుగడుగునా ఉచ్చుల్ని దాటుకుంటూ బస్తీకొచ్చి
చెవులొగ్గి వినేవారికి ఒక్కమారు గుండెమూలుగు వినిపిద్దామనుకుంటే
అక్కడకూడా మనుషుల బట్టలు తొడిగేసుకున్న
రాబందుల రెక్కల నీడలు —
అడివిలో అబ్బా అంటే ఎవరేనా ఉలుకుతారు
కళ్లూ, చెవులూ, చర్మం, మెదళ్ళు అలంకారమే ఇక్కడవాళ్ళకి
పెద్దపెద్ద చదువుల్ని ఒళ్ళంతా పులుముకుంటూ
సంస్కారం పాకుడుకట్టిన రోడ్లమీద జారిపోతున్నారే తప్ప
ఘోరుమనే సజీవ ప్రవాహాల సడిని పన్నెత్తైనా పలకరించలేదు

జీవితం వాసనవేసే ప్రతిచోటా రాబందుల గుంపుల తారాటలు —
కొండకోనల దూకే జలపాతాల హోరుల్లో
ఆయుధం సంధిస్తున్న విలుకానికి గురిచూస్తే సమస్యేలేదు.

—కె. విశ్వనాథం

# వారసులం

నాగుండె తలుపు తోసుకొని మీరెలా వచ్చారో నామమాత్రం గుర్తులేదు
మొదట్లో కల్పినప్పుడు మిమ్మల్నెంత నిర్లక్ష్యంగాచూశానో అదిమాత్రంగుర్తుంది
నాగుండె లోతుల్లో మీవేళ్ళు పెట్టి
నా మురికిని గెలుకుతూ తీసివేయడం చూశాను
నాదంటున్నా అహానికి దెబ్బతగిలి
బూర్జువాలోచన వదలలేక నిన్ను తల్చి కన్నీరాడడం చూశాను
నీవు నాలోని ప్రేమను, త్యాగాన్ని
తీసుకురావడం చూసి ఉక్కిరిబిక్కిరయ్యాను
హృదయాంతరాళంలోని రొచ్చును కడిగేస్తుంటే సంబరపడ్డాను
పట్టుదల కార్యదీక్షలనే కత్తులను నా గుండెల్లో దించినపుడు
నా బూర్జువుడు విలవిల్లాడి కొట్టుమిట్టాడ్డం చూశాను
చీకటి రాత్రిలో కూడా గురిచూసి ట్రిగ్గర్ నొక్కినట్లు
మీరు నాగుండెల్లో దిగబడ్డారు
పెరుగును చిలికి వెన్నను తియ్యడం ఎంత సత్యమో
నా బూర్జువా మెదడును చిలికి కార్మికవర్గ చైతన్యం చేపడం అంత సత్యమే
కాని కామ్రేడ్!
యుద్ధం మధ్యలో వుండి కన్నీరు కార్చలేంకదా!
గుండె బరువెక్కినా గన్నును సడలించలేంకదా!
కన్నీరును రక్తకన్నీరుగా, బాధలను అణుబాంబుల్లా
శత్రువుపై విసరటంవల్లె మాత్రమే మేం నీకు నిజమైన వారసులం

—సముద్రుడు

# ఆశ

భవిష్యత్‌పైన ఆశ, భవిష్యత్ చిత్రపటంపైన ఆశ
జన జీవితాలపై ఆశ శత్రువుపై కసిని రేపుతుంది

అగాధం అంచున ప్రమాదమున లక్ష్యంపై ఆశ
ప్రమాదాన్ని ఎదిరించే ధైర్యాన్నిస్తుంది
కంటకావృతమైన గమ్యంలో గమ్యంపై ఆశ
దారి కడచేరే సత్తువనిస్తుంది
వడివడిగా సాగే పోరులో ప్రతిమలుపు ఒకపాఠం అయితే
ప్రతిపాఠం ఆశగా భవిష్యత్ ఆలంబనవుతుంది
కసిగా దూసినకత్తి ఒడుపుగా తీసుకున్న పొజిషన్
రణంలో గెలుపుకు ఆశగా నిలిస్తే
గాయపడ్డ భుజం కూడా బాధను మరిచిపోయే వేళ యిది
పల్లెలో, పట్నంలో, అమరుల రహదారుల్లో
సాగిపోయే నవతరం నవతకోసం సాగుతుంటే
ఎర్రబావుటాల రెపరెపలు మా మదిలో
ఆశల నమ్మకాల్ని పెంచే సమయమిది
చిగురించిన అడవి ఎదుగుదలకు చిహ్నం అయిన వేళ
నశించే మ్రాను 'పరిణామం'లో ఎక్కడో అక్కడ
రూపాంతరం చెందితే
పుట్టుక-పెరుగుదల-అభివృద్ధుల క్రమం
గతితర్కంపై విశ్వాసం పెంచితే
తలెత్తి సాగిన దండు నిండుగా పారింది ఆశతో
నిండుతనంపై నీలాపనిందలు వేసిన శత్రువుపై
ఉమిసి, ఛీత్కరించి, వింధ్యపైపు కదులుతుంటే
అక్కడక్కడో మ్రాను నేలకొరిగితే
'పునరుత్థానం'పై ఆశ లేకుండా క్రొంగొత్తగా ఎదిగిన తరం
ఆలంబనగా - ఆశతో - నమ్మకంగా ముందుకు కదలబారుతున్నవేళ
శత్రుపక్షం చేరిన ద్రోహిపై ఆశల పందిరులల్లి
ఉదారంగా నిలిస్తే పడిపోతాం
నవతరం, యువతరం ఆశల-ఆశయాల పల్లవే నా పాటకు నాదం.

—గౌతమి



## మార్చి 8 అంతర్జాతీయ మహిళా దినోత్సవం సందర్భంగా ప్రత్యేక రచనలు

# ఆక్రోశం

సింధూరమూ తెలియదు మాకు
సింగారమూ తెలియదు
పసుపుకుంకుమలు మావికావు
ముంజేతికి గాజులు లేవు
మెడలో పుస్తెలూ ఉండవు
కాలిమట్టెలు, గోరింటాకులు
అలంకారాలు, ఆభరణాలు లేవు
నుదుట తిలకం దిద్దినవారు లేరు
ఒంటిమీద ఆచ్ఛాదనలుండవు
చదువు సంధ్యలు లేవు
కన్నవారు, కొన్నవారు ఇవేవీ
మన 'రివాజు' కాదంటారు —
మా మాట మోటు, మా బతుకు చేదు
స్త్రీ-పురుషుల తారతమ్యం
దేనితో గుర్తిస్తారోకానీ
పురుషులకెందులోనూ తీసిపోం.
నాగలి పట్టుతం, పొలం దున్నుతం
కట్టెలు పోస్తం, మోపులు మోస్తం
పంటపొలాలకు
మా చెమట ధారపోస్తం
కాకపోతే
కళ్ళంలో అడుగుపెట్టనివ్వరంతే
అది రివాజు

స్త్రీ పురుషులం ఏకంగా
అడవి అడవంతా గాలిస్తం
వలలు పెడతం, పరుగులుతీస్తం
ఆయాసం, అలసట మర్చిపోతం
జీవన్మరణ సమరం చేసి
ఖడ్గమృగాలను బంధిస్తం
కాకపోతే,
పంపకాలవద్ద మాతో పనిలేదు
అది రివాజు.
పొద్దస్తమానమూ చాకిరి చేస్తం
ఎవరికీ ఎదురు మాటాడకుండా
ఏం చెప్పినా మేం చేస్తం
వంటా వార్పూ మా వంతే
వండింది పంచడం మా వంతే
అది అంతే రివాజు
కాకపోతే
నెలకైదులోజులు మమ్మల్ని వెలివేస్తారు
పుట్టింది మొదలు, వయసొచ్చేదాక
మేం ఆడతం-పాడతం
వరుసైనవారితో సరసాలూ ఆడుతం
ప్రేమకోసం నిరీక్షిస్తం
ఈడైనవాడు, జోడైనవాడు
మనసైనవాడు, 'మావాడు'

కథ :

# శాస్తి

—కె. సుజాత

అది ముషీరాబాద్ సెంట్రల్ జైలు. దానికి దగ్గరలో "సోషల్ వెల్ ఫేర్ మహిళా వసతి గృహం". చుట్టూ ప్రహరి గోడ. ఎవరైన సులభంగా గోడ దూకి ఏ రాత్రి అయినా లోపలికి వచ్చి ఏమైనాచేయవచ్చు. కింద మూడు గదులు పైన మూడుగదులు. సరిగ్గాలేని కరెంటుదీపాలు. శిథిలమై పెలసిపోయిన గోడలు. మెయిన్ గేటులో ప్రవేశించగానే చిన్నపాటి హాలు. అదే విజిటర్స్ రూము. ఆ ప్రక్కనే ఒక చెక్కబీరువా. బీరువాచాటుగా ఒక కుర్చీ, బల్ల. అదే వార్డెన్ గారి ఆఫీసురూము. ఏ నెలకో, రెండు నెలలకో ఆవిడ ఒకసారి వచ్చి హాలులోని కుర్చీని అలంకరిస్తుంది. తనకు అనుకూలమైన అమ్మాయిలను ఆఫీసర్స్‌కు అప్ప చెబుతుంది. అక్కడ హైస్కూల్ విద్యార్థినుల నుండి కాలేజి విద్యార్థినుల వరకు కనీసం 40 మంది వుంటారు. అందులో రౌడీలతో వేధింపబడే అమ్మాయిలు, మగవాళ్ళను వెక్కిరిస్తూ వారిని ఆటపట్టించే అమ్మాయిలు, సామ్రాజ్యవాద సంస్కృతి తమను కవ్విస్తుంటే, దాని ప్రభావంలో పడి ముళ్ళదారిలో నడుస్తూ అదే పూలబాట అనుకునే అభాగినులు వున్నారు.

ఉదయభానుడి లేత కిరణాలు కిటికీలోనుండి కర్తవ్యాన్ని గుర్తుచేస్తూ గదిలో నిద్రిస్తున్న శారదను తట్టిలేపాయి. శారద హడావిడిగా లేచింది. ఉద

---

కావాలని మేము కోరుకుంటం
కాకపోతే,
కల్లుతాగామనీ, ఒప్పుకున్నామనీ
కన్నవారు మా ఊసులేకుండానే
మమ్మమ్మకుంటారు
అది దివాజు
అబల, సబల, ఆదిదేవత
అపురూపం, సౌందర్యం,

నాజూకు, నెరజాన
బహురూపుల పదాల అర్థాలు
తెలియవు మాకు
మేం ఆడోళ్లం, మేం గొట్టోలం
మాకు అన్నలొచ్చిండ్రు
ఆయుధాలిస్తున్నరు, ఆదరిస్తున్నరు
మాకంతేచాలు, మాకదే కావాలి
ఇది మా రివాజు.

[ఉద్యమంతోనూ, ఉద్యమాన్ని నిర్వహిస్తున్న శక్తులతోనూ మమేక మవుతున్న మాదియా మహిళ నిశ్చితాభిప్రాయమే నాకు ప్రేరణ.]

—సాధన

యం 10 గంటలకు తాను చెలినగర్ వస్తానని అక్కతో చెప్పింది. "హాస్టల్ సమస్యలకు సంబంధించి మహిళలను ఎలా కదిలించాలి? చెలినగర్‌లో మహిళా సంఘం ఎలా పనిచేస్తుంది? ఏఏ సమస్యలు తీసుకుంటున్నారు?" ప్రశ్నల పరం పరలు శారద మెదడులో అలలు-అలలుగా సాగుతున్నాయి. శారద వెంటనే ముఖం కడుక్కొని స్నానం ముగించుకొని వచ్చింది. స్టౌమీద కాస్త బియ్యం పడేసి తాను ఇంటి దగ్గర నుండి తీసుకొచ్చిన టొమాటా పచ్చడి వేసుకొని టిఫిన్ కార్యక్రమం ముగించుకుంది. ఒక్కసారి తన వాచివైపు చూసింది టైము 8-30 కావస్తుంది. తను వెంటనే బయలుదేరితేనేకాని 10 గంటలకల్లా అనుకున్న స్థలానికి చేరుకోలేదు. హాండ్‌బ్యాగ్‌లో బస్ చార్జీలకు డబ్బులు వేసుకొని హాలు లోకి వచ్చింది.

వార్డెన్‌గారి ఆఫీసులాంటి గదిలో టేబుల్‌పైన న్యూస్ పేపర్ పడేసివుంది. టేబుల్ ప్రక్కనే ఇద్దరు అమ్మాయిలు నిలుచొని నగరంలో సినిమాలు ఏమిటని పేపరు తిరగేస్తున్నారు. వారు ఏదో కొత్త విషయం కనిపెట్టినట్టు వచ్చిన కొత్త సినిమా గురించి వాళ్ళ స్నేహితులకు చెప్పడానికి పరుగెత్తుతూ వెళ్ళిపోయారు. శారద పేపరు తీసుకొని ముఖ్యమైన వార్తలు చూస్తోంది. ఇంతలో అక్కడికి ఒక పొడుగాటి వ్యక్తి గేటులోంచి లోపలికి వచ్చాడు. 30 సం॥రాలు వుంటాయి. చామనచాయ. ఏదో ఉద్యోగం చేసే వ్యక్తిలా వున్నాడు. "ఏమండీ" అన్న పిలుపుతో శారద ముఖం పైకెత్తి అతనివైపు చూసి "ఎవరు కావాలండి?" అని అడిగింది. "విజయ I BA పిలుస్తారా" అడిగాడు. శారద లోపలికి వెళ్ళి కను క్కొని వచ్చి శారద లేదనీ నిన్నే ఎక్కడికో వెళ్ళిందనీ చెప్పింది. వచ్చిన వ్యక్తి శారద వైపు చూపు సారించి "ఈ 50 రూ.లు విజయకిస్తారా" అనడిగాడు. శారద కొంచెం సంకోచించి "ఒక వుత్తరం రాసి అందులో డబ్బులు వుంచి ఇస్తే విజయకు అందిస్తాను" అంది. ఆ వ్యక్తి కొద్దిగా చటపటాయిస్తూ "పర్వాలేదు ఈ డబ్బులు మీ...రే వుంచుకోండి" అన్నాడు. శారద కోపంగా, అనుమానంగా ఆ వ్యక్తి వైపు చూసింది అంతలోనే ఆ వ్యక్తి "మీరు చాల అందంగా వుంటారు పార్క్‌ దగ్గరికి వస్తే మనం ఇద్దరం కలిసి వెళ్ళవచ్చు" అన్నాడు. విషయం అర్థమైన శారద కోపంగా "పిచ్చి పిచ్చిగా మాట్లాడుతున్నావు, ఎవరనుకున్నావు, అలాగే వాగావంటే మర్యాద దక్కదు ముందు బయటికి వెళతావాలేదా" అంటూ గద్దించింది. అంతలో ఆ వ్యక్తి బిత్తరపోయి బయటికి నడిచాడు.

ఈ సంఘటనతో శారద మనస్సు చివుక్కుమంది. రోజూ ఎవరో ఒకరు ఇలాంటి అవమానాలకు గురికావలసివస్తోంది. రోజు రోజుకు హాస్టల్ పరిస్థితి

మరీ దిగజారిపోతోంది. నాలుగురోజుల క్రితం రాజేశ్వరి కూరగాయల కోసమని బయటికి వెళితే హాస్టల్ గేటుముందు ఇద్దరు రౌడీలు ఆటో ఎక్కమని బెదిరించారు వారం రోజుల క్రితం స్వరూప బస్ దిగి హాస్టల్‌కు వస్తూవుంటే పది మంది చుట్టూచేరి దారి ఇవ్వకుండా కాసేపు సతాయించారు. ఇలా జరుగుతూవుంటే ఎన్నాళ్ళని వూరుకోవాలి? ఏం చేయాలి? ఈ సమస్యలకు సంబంధించి ఏదో ఒకటి చేయాలనీ తనతోపాటు వున్న సరళ, రాజేశ్వరి, మాధవి, శోభ మిగతా హాస్టల్‌లో వున్న అమ్మాయిలను కూర్చోబెట్టి రెండురోజుల క్రితమే మాట్లాడింది. సుడులు తిరుగుతున్న ఆలోచనలతో శారద హాండ్‌బ్యాగ్ తీసుకొని బయటికి నడిచింది.

చెలినగర్ వెళ్ళాలంటే రెండు బస్సులు మారాలి. బస్‌దిగిన శారద నాలు గడుగులు వేయగానే ఎవరో తన వెనకాలే నడిచినట్లు అన్పించి తిరిగి చూసింది ఆశ్చర్యంతో శారదకు తలతిరిగిపోయింది. హాస్టల్‌లో కన్పించిన వ్యక్తి హాస్టల్ నుండి వెంబడిస్తున్నాడు. హాస్టల్‌లో జరిగిన సంఘటన తాలూకు ఆలోచనతో, వెళ్ళాల్సిన చోటికి త్వరగా చేరుకోవాలనే ఆతృతతో శారద తనను వెంబడిస్తున్న వ్యక్తిని రెండు బస్సులు మారినా గమనించలేదు.

వేగంగా శారదను కలుసుకొని ఆ వ్యక్తి "ఏమండి క్లబ్బుకు వస్తారా?" మళ్ళి ప్రశ్న. శారద మౌనంగా నడుస్తూవుంటే ఆ వ్యక్తి పక్కపక్కనే నడుస్తున్నాడు. "లాభంలేదు ఈరోజు వీడిపని పట్టాల్సిందే" అని మనస్సులో అనుకున్న శారద కోపాన్ని, అసహ్యాన్ని దిగమింగి ఆ వ్యక్తితో "నాతోపాటే వస్తారా రండి మావాళ్ళతో మాట్లాడతాను" అంది. ఆ వ్యక్తి శారద మాటలకు ఉబ్బితబ్బిబ్బయ్యి తన రొట్టెవిరిగి నేతిలో పడిందనుకున్నాడు. చాలా సంతోషంగా శారద వెనకాలే నడుస్తున్నాడు.

ఇండస్ట్రియల్ ప్రాంతంగా ప్రసిద్ధిచెందిన బాలనగర్ సమీపంలోని రాజు కాలనీ దగ్గరలో చెలిబండరాజ్‌నగర్ ఉంది చెలినగర్‌లో 105 గుడిసెలు ఉన్నాయి **H.A.L** కాలనీ గోడకానుకొని రెండు వరుసలుగా గుడిసెలున్నాయి. గుడిసెలు వేయకముందు అది పోరంబోకుభూమి. అది ఒక భూస్వామి అక్రమ ఆక్రమణ లోనిది. ఇతర జిల్లాలనుండి బ్రతుకుతెరువుకోసం పొట్టచేతపట్టుకొని నగరం చేరుకున్న అనేక మంది చుట్టూఉండే ఫ్యాక్టరీలలో రోజు కూలీలుగా పనిచేస్తున్నారు. ఆ మహానగరంలో కూటితోపాటు, గూడుకోసం వెంపర్లాడుతున్న కార్మికులు పోరాటాలు చేసి భూమిని ఆక్రమించుకున్నారు. ఇండ్లస్థలాల ఆక్రమణలో

స్త్రీలు ప్రధాన పాత్ర వహించారు. భూస్వాముల గూండాలు రాడ్స్, కర్రలు, కత్తులు పట్టుకొని గుడిసెవాసులమీదకు వస్తే మహిళలు ముందుండి రాళ్ళతో విసిరికొట్టి, గుండాలు కాళ్ళకి బుద్ధిచెప్పేటట్టు చేశారు. అక్కడ యువజన సంఘం పనిచేస్తోంది. దానితోపాటు మహిళా సంఘం వెలిసింది. అక్కడ ఏ సమస్య వచ్చినా ముందుగా కదిలేది మహిళలే. సమసమాజస్థాపనకోసం చివరిదాక కలం పట్టి క్రాంతిపథంలో నడిచి అమరుడైన కా॥ చెఱబండరాజు పేరును ఆ గుడిసె వాసులు ఎంతో ప్రేమగా పెట్టుకున్నారు. శారద ఆ మహిళా సంఘంలో పని చేస్తోంది.

చెఱనగర్ వచ్చేసింది 10 గజాలదూరంలోనే గుడిసెలు కన్పిస్తున్నాయి. శారద ఆ వ్యక్తితో "ఇక్కడే నిల్చోండి మావాళ్ళతో మాట్లాడివస్తాను" అంటూ మెల్లగా గుడిసెల వైపు నడిచింది. దూరంనుండి శారదను చూసిన పిల్లలు శారదక్క వస్తోంది అంటూ వార్తను చేరవేశారు. లక్ష్మక్క అక్కడి మహిళలకు చదువు చెబుతోంది. మహిళల్లో చైతన్యం పెంచడానికి చుట్టూఉండే కార్మికవాడల్లో పనిచేస్తోంది. నీళ్ళల్లో చేపలా లక్ష్మక్క ఆ గుడిసెవాసుల్లో కలిసిపోయింది. అందుకే లక్ష్మక్క అంటే శారదక్కకు ఎంతో గౌరవం, అభిమానం.

శారద గుడిసెలో అడుగుపెడుతూనే 'అమ్మయ్య' అందరు ఉన్నారుకదా అంటూ నిట్టూర్చింది. ఎప్పుడులేంది ఇలా నిట్టూరుస్తుంది ఏంటి అనుకొని అందరూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. శారద ఆ వ్యక్తి గురించి హాస్టల్‌లో జరిగిన విషయాన్ని పూసగుచ్చినట్టు చెప్పింది. తను ఆ వ్యక్తిని గుడిసెలదాక తీసుకొచ్చిన విషయం కూడా చెప్పింది. లక్ష్మక్కతోపాటు మిగతా మహిళా సంఘం సభ్యులు విషయం గురించి చర్చించారు. ఈ సమస్య అటు హాస్టల్‌లోను ఇటు ఇండస్ట్రియల్ ప్రాంతం కాబట్టి బాలనగర్‌లోనూ ఉంది. ఫ్యాక్టరీలకు పని కోసం వెళుతున్న మహిళలు గూండాల వేధింపులకు, అమానుషచర్యలకు గురి కావలసి వస్తోంది. ఒకసారి ఒకడికి బుద్ధిచెబితే మిగతా గూండాలకు ఒక షాక్ ఇచ్చిన వాళ్ళమవుతాం అనే అభిప్రాయం అందరిలోనూ ఉంది.

వాడిపని మేమేపడతాం అంటూ ఆ వ్యక్తిని వెంటనే తీసుకొని రమ్మన్నారు ఆ వ్యక్తి గుడిసెల మధ్యకు రాగానే అక్కడి మహిళలు ఒక చెట్టు కింద అరుగు మీద ఆ వ్యక్తిని కూర్చోమని చెప్పారు. మహిళలు, యువకులు, పిల్లలు ఆ వ్యక్తిని వింతజంతువును చూసినట్టు చూస్తున్నారు ఒక మహిళ ముందుకు వచ్చి ఆ వ్యక్తిని ఉద్దేశించి కొన్ని ప్రశ్నలు వేసింది. పేరు మారక్క, సఫాయిపని చేస్తుంది. వయస్సు 25 సం॥లు. నల్లగా ఉంటుంది. ఆర్థిక ఇబ్బందులు పని

భారం, సంసారంలో సమస్యలతో చూసేవారికి 35-40 ఏళ్ళ మనిషిలా కన్పిస్తుంది. ఎప్పుడు ఆకు నములుతూ వుంటుంది.

ఆమె ప్రశ్నలు వింటుంటే జీవితంలో పండిపోయినట్టు కన్పిస్తుందామె. "నీవు ఆ అమ్మాయిని ప్రేమిస్తున్నావా?" మారక్క. "అవును" అన్నాడతను. "ఎన్నిరోజుల నుండి పరిచయం?" "ఈరోజే చూశాను." "ఈరోజే చూశావు. అప్పుడే ప్రేమపుట్టుకొచ్చిందా? పెళ్ళిచేసుకుందామనుకుంటున్నావా? వట్టి ప్రేమేనా?"

"మా అమ్మ, నాన్న ఒప్పుకుంటే పెళ్ళిచేసుకుంటాను"

"అమ్మ నాన్నా ఒప్పుకోరవోతే?" మౌనంగా ఉన్నాడు.

"పెళ్ళి చేసుకుందామనే ఆలోచన బాగానేవుంది గానీ, మరి డబ్బులు, క్లబ్బుకి రమ్మనడం ఎందుకన్నట్టు?"

ఆ వ్యక్తికి నోట మాటరాలేదు. ముఖంలో రక్తం చుక్కలేకుండాపోయింది. తనకేదో జరుగుతుందని అనుకున్నాడు. మారక్క కోపంతో "దొంగముండా కొడుకా డబ్బులతో ఆడపిల్లల బతుకులు పాడుచేద్దాం అనుకున్నావురా?" అంటూ ఎడమకాలి చెప్పు తీసుకొని మూతిమీద ఒక్కటి అంటించింది. గుంపులో ఉన్న మహిళలు "దొంగముండాకొడుకును చెట్టుకు కట్టెయ్యండి" అన్నారు. ఆ వ్యక్తిని చెట్టుకు కట్టేశారు, ప్రజాపంచాయతీ నడిచింది, ఆ వ్యక్తికి గుండు గీసి సున్నపు బొట్లు పెట్టి బాల్‌నగర్ చౌరస్తా వరకు ఊరేగించాలని నిర్ణయించారు. ఇద్దరు యువకులు ఆ వ్యక్తికి గుండుగీసి సున్నపుబొట్లు పెట్టారు. షర్టు, ప్యాంటు ఊడదీసి ఒకచేతిలో పెట్టారు. మరో చేతిలో "ఆడపిల్లల వెంటబడితే నా గతే పడుతుంది" అనే మాటలు రాసిన ప్లేకార్డును పట్టించారు.

ఇద్దరు యువకులు డప్పులు మోగిస్తూవుంటే, మహిళలు, పిల్లలు, గుడిసెవాసులు అంతాకలిసి మహిళలకు జరుగుతున్న అన్యాయాలకు వ్యతిరేకంగా నినాదాలుచేస్తూ ఊరేగింపుగా కదిలారు. ఊరేగింపు బాలనగర్ చౌరస్తా చేరుకుంది. అప్పుడు సమయం సా॥ 5 గం॥లు అవుతుంది చుట్టూ ఫ్యాక్టరీల నుండి తమ శ్రమను అమ్ముకొని ఇళ్ళకు చేరుకుంటున్న కార్మికులతో ఆ రోడ్డులో జన ప్రవాహంలా కన్పిస్తోంది ఊరేగింపును చూసి విషయం అర్థమైన జనం "బలే చేశారే ఇలాగే చేయాలి. మిగతావాళ్ళకు బుద్ధి వస్తుంది" అంటున్నారు. విచిత్ర వేషంలో ఉన్న వ్యక్తిని చూసి నవ్వుకుంటున్నారు. వారి సంఘటిత శక్తి గూండాల గుండెల్లో రైళ్ళు పరిగెత్తించింది.

[బాలనగర్ (హైద్రాబాద్)లో 1985లో జరిగిన యధార్థ ఘటనకు కథనరూపం]

# డైలీ రిపోర్టింగ్‌లో మహిళా జర్నలిస్టులు

—రత్నమాల

ప్రచారసాధనాలు, ముఖ్యంగా పత్రికలు సామాజిక మార్పును ప్రభావితం చేస్తాయనే విషయంలో సందేహంలేదు. ప్రజాభిప్రాయాన్నీ, వ్యక్తుల విశ్వాసాలనూ, వ్యక్తిగత దృక్పథాలనూ క్రమంగా తీర్చిదిద్దడం ద్వారా ప్రచార సాధనాలు మారుతున్న సామాజిక వ్యవస్థ సైద్ధాంతిక దృక్పథాన్ని కొంతవరకు నిస్సందేహంగా ప్రభావితం చేస్తాయి. అయితే ఈ ప్రభావం ఆ సమాజం యొక్క మార్పు, అభివృద్ధిక్రమానికి అనుకూలమైనదా ప్రతికూలమైనదా అనే విషయం ఆయా ప్రచారసాధనాల నిబద్ధత, ప్రయోజనాలపై ఆధారపడి ఉంటుంది.

దేశ స్వాతంత్ర్యానికి పూర్వం ప్రచారసాధనాలు జాతీయ ప్రయోజనాలకు అంకితమై పనిచేయడంవల్ల భారతీయ సామాజిక వ్యవస్థ మార్పులోనూ, సాంఘిక సంస్కరణ ఉద్యమాల్లోనూ కెటలిస్టు పాత్రను నిర్వహించాయి. అదిఈవిధమైన ప్రధాన పాత్రను నిర్వర్తించగలగడానికి కారణం స్వాతంత్ర్యానికి పూర్వం ప్రచారసాధనాలు ముఖ్యంగా పత్రికలు ప్రారంభించినవారు, నిర్వహణ కొనసాగించిన వారూ జాతీయవాదులో లేక సంఘసంస్కర్తలో కావడం, వారీ పత్రికలను తమ సైద్ధాంతిక ప్రచారంకోసమే నిర్వహించడం కారణం. ఇందువల్ల ఈ పత్రికల్లో సమాజంలోని మిగతా అట్టడుగు అణగారిన ప్రజల ఆర్థిక సామాజిక సమస్యలతోపాటు స్త్రీల సమస్యలనూ, ఆకాలంలో స్త్రీలు నిర్వహించిన పాత్రను కూడా పత్రికలు ప్రతిబింబించాయి.

తక్కువ సర్క్యులేషన్ ఉన్నప్పటికీ వామపక్ష, ప్రజాస్వామిక భావాలతో నిర్వహిస్తున్న కొన్ని ప్రత్యామ్నాయ పత్రికలు తప్ప స్వాతంత్ర్యానంతర కాలంలో వస్తున్న పత్రికలు స్వాతంత్ర్యానికి పూర్వం వచ్చిన పత్రికలకు పూర్తి విరుద్ధంగా ఉన్నాయి. ప్రస్తుత పెద్ద పత్రికలన్నీ (ప్రత్యామ్నాయ పత్రికలు చిన్న పత్రికలు) బడావ్యాపారసంస్థల యాజమాన్యం నడుపుతున్నట్టివే. ఇదేవిధంగా దృశ్యశ్రవణ ప్రచారసాధనాలైన దూరదర్శన్‌పైనా, రేడియోపైనా కేంద్రంలోని అధికారపార్టీకి పూర్తి అదుపు ఉంటుంది. ఈవిధంగా పత్రికల మౌలిక స్వరూప స్వభావాలను నిర్ణయించేది పెట్టుబడి అన్న విషయం అర్థం చేసుకోవచ్చు. ఇక రేడియో, టి.వి అధికారంలో ఉన్న పాలకపక్షం అభిప్రాయాలనే ప్రసారం చేస్తుంది. పైకిమాత్రం ఈ అచ్చు, దృశ్య, శ్రవణ ప్రచార

సాధనాలు కూడా సామాజికస్పృహ ఎంతగానో ఉన్నట్లు భ్రమింపజేయడానికి ప్రయత్నిస్తూ ఉంటాయి, ఈ ప్రయత్నం అంతా అధికార భావజాలానికి భిన్నమైన అభిప్రాయాలకు ప్రాతినిధ్యం వహించే వర్గాలను ఆకర్షించడానికి, భ్రమలు కల్పించడానికే. ఈ విధంగా ప్రయత్నించే క్రమంలో ఈ ప్రచారసాధనాలు అణగారిన పీడితవర్గాల సమస్యలను కొంతవరకు ప్రతిబింబించినప్పటికీ మౌలికంగా పీడిత ప్రజల పక్షాన నిలబడవు. అయితే కేవలం తమ ఉనికిని నిలుపుకునే ప్రయత్నంలో చలనచిత్రాలతోసహా మొత్తం ప్రచారసాధనాలన్నీ కూడా "పెట్టుబడి" ప్రయోజనాల పరిమితుల్లోనే అయినప్పటికీ కొనుగోలుదారులు అంటే విస్తృతార్థంలో ప్రజల ఆశలను ఆకాంక్షలను, స్పందనలను సంతృప్తిపరచడానికి మోసపూరిత ప్రయత్నం చేస్తాయి.

ఈ క్రమంలో ప్రచారసాధనాలు ముఖ్యంగా పత్రికలు సామాజిక మార్పుకు ప్రాతినిధ్యం వహించే భావాలకు సిద్ధాంతాలకు, ఆశయాలకు ఆదర్శాలకు కొంత మేరకు అవకాశం కల్పించడమేకాకుండా, ఏదో ఒక రీతిలో ప్రతిబింబిస్తాయి. అయితే ఈ సమస్యల పట్ల నిజమైన నిబద్ధతలేని కారణంగా స్త్రీలతోసహా పీడిత ప్రజల సమస్యలను ప్రతిబింబించడంలో చాలావరకు వక్రీకరణలకు, పక్కదారి పట్టించడానికి, తప్పుగా వ్యాఖ్యానించడానికి, అర్ధసత్యాలు ప్రకటించడానికి, అయోమయానికి, అస్పష్టతకు అవకాశం ఉంటుంది. ఈ విషయాలను అనేక పరిశీలనలు ఉదహరణలతోసహా వెల్లడిస్తున్నాయి. పత్రికలతోసహా అన్నిరకాల ప్రచారసాధనాలు స్త్రీలను సెక్సుమోడల్స్‌గానూ, బలహీనులు, తెలివిలేనివారు, ఉద్రిక్తస్వభావులు, విపరీత మనస్కులు, నిష్క్రియాపరులు అనే అరిగిపోయిన భావాలనే ప్రచారంచేస్తూ, కేవలం భార్య, తల్లి, గృహిణిగా మాత్రమే స్త్రీని పరిచయంచేస్తూ ఇతరత్రా స్త్రీలు నిర్వహిస్తున్న పాత్రను పూర్తిగా మరుగు పరుస్తూ స్త్రీలపట్ల వివక్ష, వక్రీకరణలతోకూడిన సెక్సిస్టు దృక్పథాన్ని ప్రతిబింబిస్తున్నాయని ఈ పరిశోధనలు ప్రచారసాధనాల దోషాలను ఎత్తిచూపాయి. ప్రచారసాధనాల్లో స్త్రీల వక్రపూరిత చిత్రీకరణకు వ్యతిరేకంగా గత పదిసంవత్సరాలకుపైగా గణనీయమైన కృషిచేస్తున్న శ్రీమతి కమలాబాసిన్ సంపాదకత్వంలో ప్రచురించిన "స్త్రీలు - ప్రచారసాధనాలు" అన్న పుస్తకానికి ఆమె రాసిన ముందుమాటలోని కొన్ని వాక్యాలు ఇక్కడ ఉదహరించడం సందర్భోచితంగా సమయానుకూలంగా ఉంటుంది. ప్రచారసాధనాలు సమకాలీన వాస్తవికతను ప్రతిబింబిస్తాయని, వాటిని సమర్థించేవారు వాదిస్తుంటారు. కానీ ఇది కొంతవరకే నిజం. సామాజిక వాస్తవికతకు ప్రచారసాధనాలకు రెండుకాల

సంబంధం ఉంటుంది. ఒక విధంగా ప్రచారసాధనాలు సమాజంలో ఉనికిలో ఉన్న విషయాలనే ప్రతిబింబిస్తాయి. కానీ మరోప్రక్క ఎన్నుకున్న విషయాలనే ప్రతిబింబించడం లేదా ప్రకటించడంద్వారా ప్రచారసాధనాలు సామాజిక వాస్తవికతను ప్రభావితంచేస్తాయి. వాఖ్యానించడంలోనూ, ప్రకటించే పద్ధతిలోనూ ప్రచారసాధనాలు ప్రకటించదలచుకున్న స్వంత సామాజిక వాస్తవికతనే ప్రచారం చేస్తాయి. అంతేకాదు సామాజిక వాస్తవికతను వక్రీకరించి ప్రకటించడం ద్వారా స్వంత విలువలను దృక్పథాలను ప్రచారసాధనాలు ప్రజలపై రుద్దుతాయి. ఈవిధంగా ప్రచారసాధనాలు స్త్రీలు నిర్వర్తిస్తున్న అనేక రకాల పాత్రలను వక్రీకరించి పురుషులు స్త్రీలకంటే గొప్పవాళ్ళు అనే దృక్పథాన్నే ఎల్లవేళలా కలిగిఉంటున్నాయి. ఇందుకు ఉదహరణగా అనేక విషయాలు చెప్పవచ్చు. పిల్లలను కనడం, పెంచడం, గృహనిర్వహణ మొదలైన పనులే కాకుండా ప్రపంచంలోని మొత్తం పనుల్లో యాభై శాతం పనులు, ప్రపంచంలో ఉత్పత్తి అవుతున్న ఆహారంలో సగం ఆహార ఉత్పత్తి మహిళల చేతులమీదుగానే జరుగుతుండగా ప్రచారసాధనాలు ఈ అంశాలను పట్టించుకోకపోవడం, ప్రసూతి సెలవు, శిశుసంరక్షణాలయాలు వంటి ఉద్యోగసమస్యలకు గుర్తింపు ఇవ్వకుండా స్త్రీలపై జరుగుతున్న వివిధరకాల అత్యాచారాలకు సంబంధించిన వార్తలను అత్యంత ప్రాధాన్యమిచ్చి సెన్సేషనలైజ్ చేసి ప్రకటించడం గమనించవచ్చు. ఈ అననుకూల అంశాలు ఉన్నప్పటికీ కూడా పత్రికల్లో పనిచేస్తున్న జర్నలిస్టులకు ముఖ్యంగా పైస్థానాల్లో వున్న జర్నలిస్టులకు నిజంగా స్త్రీ సమస్యపట్ల సానుభూతి ఉన్నట్లయితే ఈ సమస్యను పత్రికల్లో ప్రతిబింబించడంలో సంబంధించి కొంత అనుకూల ప్రయోజనాలు సాధించవచ్చు. ఆయా సంస్థల ప్రయోజనాలు విధానాల పరిమితులకు లోబడి అయినప్పటికీ సంపాదకులు, బ్యూరోల చీఫ్‌లకు కొంత పలుకుబడి, ఆధికృత ఉంటుంది కనుక సమస్య పట్ల నిజమైన సానుభూతి ఉన్నట్లయితే ఎంతో కొంత మేరకు వీటికి సరియైన ప్రాతినిధ్యం కల్పించవచ్చు. పైస్థాయిల్లో వున్న సహాయ సహకారాలతో సమస్యపట్ల నిబద్ధత చిత్తశుద్ధి వున్న క్రిందిస్థాయి జర్నలిస్టులు కూడా ఈ విషయంలో ప్రయోజనకరమైన పాత్రను నిర్వర్తించడం సాధ్యమే.

"పత్రికలు - స్త్రీలు - మారుతున్న పాత్ర" అనే ప్రస్తుత చర్చాంశాన్ని కూడా పైన పేర్కొన్న నేపథ్యంలోనే తులనాత్మకంగా విశ్లేషించి చర్చించి అర్థంచేసుకోవాల్సి వుంటుంది. అప్పుడే సమస్య యొక్క వాస్తవ కారణాలను

సరిగా అర్థంచేసుకోవడం, సరియైన పరిష్కార విధానాలు రూపొందించుకోవడం సాధ్యమవుతుంది.

ఇంతవరకు పేర్కొన్నట్లుగానే స్త్రీలతోసహా పీడితప్రజల అభ్యున్నతి సమానత్వాన్ని చిత్తశుద్ధితో ఆకాంక్షించే నిబద్ధులైన జర్నలిస్టులు కూడా కొంత వరకు సమస్యలను ప్రతిబింబించడంలో అనుకూల పాత్ర వహించడం సాధ్యమవుతుంది. పత్రికల యాజమాన్యాలు అధికారంలో వున్న పాలకపక్షానికో లేదా అధికారంకోసం ఘర్షణపడుతున్న పాలకపక్ష (ప్రతిపక్షం) నికో చెందివున్నందున జర్నలిస్టులు ఈ కాస్త "అనుకూల పాత్ర" వహించడాన్ని అనుమతించక పోవచ్చు కూడా. అందువల్ల జర్నలిస్టుల నిబద్ధతకు, సానుభూతికి పత్రికల్లో కొద్ది చోటు మాత్రమే వుండేది. సమస్యలపట్ల ఎంత నిబద్ధత గలిగిన జర్నలిస్టులైనా యాజమాన్యాలు అనుమతించిన స్వేచ్ఛ పరిధిలోనే తాము చేయగలిగింది వుంటుందని గ్రహించాలి.

జాతీయోద్యమానంతరం సుమారు మూడు దశాబ్దాలు ముగిసిన తర్వాత అధికారంకోసం సంఘర్షిస్తున్న పాలకపక్షం (ప్రతిపక్షం) అత్యవసర పరిస్థితి అనుభవాల గుణపాఠంతో అత్యవసర పరిస్థితి ముగిసీ ముగియడంతోనే కేవలం స్వప్రయోజనాల దృష్ట్యానే అయినా "నిబద్ధ జర్నలిజాన్ని" భుజానేసుకొని బుజ్జగించడం ప్రారంభించింది. వీరితో పోటాపోటీగా అధికారంలో కొనసాగుతున్న పాలకపక్షం కూడా ఇదే స్వప్రయోజనాలకోసమే "ఈ నిబద్ధ జర్నలిజాన్ని" ఇందులో భాగంగా స్త్రీలతోసహా పీడిత ప్రజల పక్షం వహించే జర్నలిజాన్ని లాలించడం మొదలుపెట్టింది. ఫలితంగా స్త్రీలు - దళితులు మొదలైన పీడితప్రజల సమస్యలు, పోరాటాలు పత్రికల్లో ప్రముఖంగా చోటుచేసుకోవడం ప్రారంభమయింది. ఇది కొంతవరకు ప్రచారసాధనాల ప్రజాస్వామికీకరణకు తోడ్పడిందని చెప్పవచ్చు.

అయితే ఈ ప్రజాస్వామికీకరణ క్రమంలో అనేక పరిమితులు, అడ్డంకులు లేకపోలేదు. ఇదే ప్రస్తుత ప్రచారసాధనాలకు ప్రధానంగా పత్రికారంగానికి సంబంధించిన భౌతిక వాస్తవికత. ప్రచారసాధనాల్లో స్త్రీ సమస్యకు కూడా ఈ భౌతిక వాస్తవికతే వర్తిస్తుంది అందువల్ల క్రమంగా స్త్రీల సమస్యలు, వారిపోరాటాలు పత్రికల్లో అంతకంతకూ చోటుచేసుకుంటున్నాయి. అంత సంతృప్తికరంగా పెరగకపోయినప్పటికీ మహిళా జర్నలిస్టుల సంఖ్య కూడా ఇటీవల కొద్ది సంవత్సరాలుగా పెరుగుతూ వస్తున్నది.

ఈ స్థితిలో గత పదిహేను సంవత్సరాలుగా పత్రికారంగంలో వర్కింగ్ జర్నలిస్టుగానూ, సుమారు 18 సంవత్సరాలుగా మహిళా వుద్యమంలోనూ అనుభవం కలిగి గత మూడు సంవత్సరాలుగా రిపోర్టింగ్‌లో పనిచేస్తున్నందువల్ల నేను ఇక్కడ రిపోర్టింగ్‌లో మహిళల పరిస్థితిని చర్చించడం అవసరమని భావిస్తున్నాను.

కొద్దిమంది పైస్థాయిల్లో వున్న జర్నలిస్టులు తప్ప స్త్రీలను డైలీ రిపోర్టింగ్‌లో అంగీకరించేస్థితి ఇంకా మన పత్రికారంగం ముఖ్యంగా స్థానిక భాషా పత్రికారంగం ఎదగలేదు. ప్రచారసాధనాలు మొత్తం సామాజికవ్యవస్థతో సంబంధంలేనివికావు కనుక మన సామాజికవ్యవస్థ ప్రధాన లక్షణాలలో ఒకటైన పితృస్వామ్య భావజాలం పత్రికారంగంలో కూడా బలీయంగానే వుంది. అందువల్ల పత్రికారంగం స్త్రీలను, ముఖ్యంగా డైలీ రిపోర్టింగ్‌లో మహిళల వునికిని అంగీకరించదు. అయితే గత పదిసంవత్సరాల మహిళా వుద్యమంలో కార్యకర్తల నిరంతర కృషి, అంతర్జాతీయ మహిళా దశాబ్దం స్థానిక మహిళా సంస్థల వుద్యమాల ప్రభావంవల్ల కొంత విస్తృతార్థంలో ప్రచారసాధనాలు ముఖ్యంగా పత్రికలు మహిళల సమస్యలకు, వార్తలకు అంతకంతకు మరింతగా ప్రాధాన్యం యివ్వడమేగాకుండా స్త్రీలను అడిగి మరీ ప్రత్యేక వ్యాసాలు శీర్షికలు రాయించుకుంటున్నాయి. కానీ పత్రికారంగం ఇంకా డెయిలీ రిపోర్టింగ్‌లో స్త్రీలను అంగీకరించలేకపోతున్నది. ఈ ధోరణి మహిళా రిపోర్టర్లు ఎదగడానికి మాత్రమే కాకుండా దైనందిన వార్తల్లో సమస్యలు చోటుచేసుకోవడం సక్రమంగా ప్రతిబింబించకపోవడం వక్రీకరించడం, అవగాహనలోపంతో ప్రకటించడం వంటి ప్రతికూల ధోరణులకు ఆస్కారమిస్తున్నది. కొందరు స్త్రీలకు రిపోర్టింగులో ఉద్యోగాలు ఇస్తున్నప్పటికీ, సూత్రరీత్యా డెయిలీ రిపోర్టింగ్ మహిళల ఉనికికి పత్రికారంగం ఆమోదం లేదు. ఈవిధంగా స్త్రీలని డెయిలీ రిపోర్టింగ్‌లో అంగీకరించకపోవడానికి సంబంధించిన సమస్యలు కొంత ఈ రంగం అంతరంగికమైనవి, మరికొంత వరకు ఊహాజనికమైనవేకాక విభిన్న కోణాల్లో ప్రకటితమవుతూ ఉన్నది. డెయిలీ రిపోర్టింగ్‌లో మహిళలకు వ్యతిరేకంగా వున్న ఈ అననుకూల పరిస్థితి వల్ల డెయిలీ రిపోర్టింగ్‌లో వున్న మహిళలే కాకుండా, స్త్రీలను రిపోర్టింగ్‌లోకి తీసుకోవడం పట్ల సానుకూలత కలిగిన నిర్ణయాత్మక స్థాయిల్లోని జర్నలిస్టులకు కూడా ఇబ్బందికరమైన పరిస్థితులు కల్పిస్తుంది. మహిళా రిపోర్టర్లు ఎదుర్కొంటున్న పత్రికారంగ స్వీయాత్మక, భౌతిక, ఊహాజనిత, అంతర్గత, బహిర్గత సమస్యల ప్రభావం మహిళ

లను రిపోర్టింగ్‌లో అంగీకరించే నిర్ణయాత్మకస్థాయి, జర్నలిస్టులకు ఇబ్బందులు కల్పిస్తుంది.

వార్తలు సేకరించే చోట్లలోనే కాకుండా స్త్రీలను సమానత్వాన్ని మనసా వాచా గుర్తించని సాటి జర్నలిస్టులనుంచికూడా అనేక ఇబ్బందికరమైన నిరాశా కరమైన, అసౌకర్యమైన, అవమానకరమైన పరిస్థితులను ఎదుర్కొనవలసి ఉంటుంది.

నావిగేషన్ అధికారులు నావికా ప్రదర్శన సందర్భంగా మహిళా రిపోర్టర్లకు ప్రవేశాన్ని నిరాకరించడంపై బొంబాయి మహిళా జర్నలిస్టులు నిరసన ప్రకటించారు. (1989 ఫిబ్రవరి 16 ఇండియన్ పోస్ట్ వార్త) ఇందుకు ప్రధాన కారణం ప్రస్తుత సమాజంలో పత్రికారంగంలోనూ, మొత్తంగా సమాజంలోనూ స్త్రీల విషయంలో లోపభూయిష్ఠమైన దృక్పథం ప్రధానంగా ఉండడమే. స్త్రీలు కొన్ని పనులకు పనికిరారని ముఖ్యంగా జ్ఞానం అవసరమైన పనులు, నిర్ణీత కాలపరిమితిలో క్రమబద్ధంగా వేగంగా శ్రద్ధగా చేయవలసిన పనులు ఒకచోట స్థిరంగా కూర్చునికాకుండా తిరుగుతూ చేయవలసిన పనులు స్త్రీలు చేయిలేరనే విశ్వాసం పత్రికారంగంలోనూ బయట సమాజంలోనూ అత్యధిక శాతం స్త్రీల లోనూ, పురుషుల్లోనూ ఇంకా బలీయంగానే వుంది ఈ విశ్వాసం ఎంత మాత్రం సరియైనది కాదు. ప్రస్తుతం కొందరే అయినా స్త్రీలు దినవారీ రిపోర్టింగ్‌లో గణనీయమైన కృషిచేస్తున్నారన్న వాస్తవంతోపాటు, గత పదేళ్ళలో మొత్తంగా రిపోర్టింగ్‌లో వస్తున్న ప్రజాస్వామికీకరణలో మహిళా రిపోర్టర్ల, మహిళా ఉద్యమాల పాత్ర ప్రధానమైనది.

[1989 అక్టోబర్ 19-21 తేదీలలో తిరుపతిలో "Women in the Press - The Changing role" అనే అంశంపైన జరిగిన సెమినార్‌లో విరసం ప్రతినిధిగా కా॥ రత్నమాల చదివిన "Women Journalists in daily reporting" అనే ప్రసంగ వ్యాసానికి రత్నమాలగారే చేసిన తెలుగు అనువాదం.]

---

'అరుణతార'కు రచనలు, చందాలు, విరాళాలు పంపవలసిన అడ్రసు

వి. చెంచయ్య

6-5-13, కావలి - 524 201, నెల్లూరు జిల్లా.

# బూర్జువా కోర్టులలో బూర్జువా న్యాయమైనా ఉంటుందా?

—వేముల

'ప్రజాస్వామ్యం'లో కోర్టులపై ప్రజలకు భ్రమలుండడం అతి సహజం కాని మార్క్సిస్టు సిద్ధాంతాన్ని సృజనాత్మకంగా అర్థంచేసుకొనే వారెవరైనా కోర్టులను 'ఉన్నవాళ్ళకు వూడిగం చేసేవి'గానే భావిస్తారు. ఎందుకనంటే అసమానమైన మానవసంబంధాలు వున్నటువంటి వ్యవస్థలో కోర్టులు అంతర్భాగంగా వున్నంతకాలం వాటి స్వభావంలో పీడితప్రజల పక్షపాతధోరణి కనపడే అవకాశం.వుండదు. ఒకవేళ మచ్చుకు కనపడినా అది పరిగణనలోకి తీసుకోదగ్గది కాదు. కానీ ఈ సమాజం అటువంటివాటినే తీవ్రంగా ప్రచారంచేసి కోర్టులపై ప్రజలకు భ్రమలను పెంచుతుంది, ఈ సందర్భంలోనే రాజ్యానికి అణచివేత బలగం - పోలీసులు, మిలటరీ - గా వుపయోగపడుతున్న వాటికి కోర్టులు చేదోడు వాదోడుగా పనిచేయడం మనం చూస్తూనేవున్నాం. ఇటువంటి ధోరణిలో భాగంగానే మన దేశంలోని అత్యున్నత న్యాయస్థానం ఫిబ్రవరి 1, 1989 వెలువరించిన తీర్పును అర్థంచేసుకోవలసి వుంటుంది.

మార్చి 21, 1984న హర్యానాలోని భివానిఖేరాకు చెందిన సుమన్‌రాణి రవిశంకర్(19)తో కలసి తన యింటి నుంచి వెళ్ళిపోయింది. వీరిద్దరూ జమ్మూకు వెళుతుండగా మార్గమధ్యంలోనే (భివానీలో) పత్రంగేటు పోలీసుపోస్టుకు చెందిన యిద్దరు పోలీసులు వీరిని అటకాయించారు. వీరిద్దరిని రాత్రి 11-30 గం॥ల సమయంలో కస్టడీలోకి తీసుకొని విడివిడిగా సెల్స్‌లో వుంచారు. ఈ యిద్దరు పోలీసులు సుమన్‌రాణిని 'రక్షణ నిలయం'లోనే చెరిచారు. ఆ తరువాత అదే స్టేషన్‌కు చెందిన ప్రతాప్‌సింగ్ అనే పోలీసు జోక్యం చేసుకొని ఆ జంటను కోర్టులో ప్రవేశపెట్టమని లేదా వదలివేయమని ఆ యిద్దరు పోలీసులకు చెప్పడం జరిగింది. దానితో ఆ జంటను యిద్దరు పోలీసులు రైల్వేస్టేషన్‌దాకా తీసుకువచ్చి, వారిని భివానీ పట్టణం వదలివెళ్ళమని ఆదేశించారు. ఆ జంట మార్చి 23న జమ్మూ చేరుకున్నారు. ఇంతలో సుమన్‌రాణి కుటుంబం, ఆమె ఆచూకీని గురించి పోలీసులకు ఫిర్యాదు చేయడంతో ఆ జంటను జమ్మూలో పట్టుకొని యింటికి తీసుకొచ్చారు. అప్పుడు తనపై జరిగిన మానభంగాన్ని సుమన్‌రాణి వివరించింది. 28-3-84న కోర్టులో కేసుపెట్టారు.

నేరశిక్షాస్మృతి (IPC) సెక్షన్ 376 ప్రకారం మానభంగానికి శిక్ష: "ఎవరు మానభంగానికి పాల్పడినా జీవితఖైదుగా శిక్షవేయాలి. లేదా ఖైదుగా శిక్షవిధిస్తూ దాని కాలాన్ని 10 సం॥రాల (పది సం॥రాల) వరకు పొడిగించాలి మరియు జరిమానా విధించాలి. 12 సం॥రాలు తక్కువగాకుండా వుండి, తన స్వంత భార్యనే మానభంగానికి గురిచేస్తే అటువంటప్పుడు ఖైదుగా శిక్షవిధిస్తూ రెండు సం॥రాల వరకూ దాని కాలాన్ని పొడిగించాలి లేదా జరిమానా విధించాలి లేదా జరిమానా, శిక్ష రెండూ విధించాలి".

పోలీసు సంరక్షణలో మానభం జరిగితే (Custodial rape) కనీసం పది సం॥రాలు కఠినకారాగార శిక్ష (Rigorous Imprisonment) విధించాలని 1983 లో నేరశిక్షాస్మృతికి సవరణచేశారు. ఈ సవరణ 1978 లో సంచలనం సృష్టించిన తుకారాం మాధురా కేసు ఫలితంగా వచ్చింది. (ఈ కేసులో పోలీసు తన రక్షణలో వున్న అమ్మాయిని చెరిచాడు). ఈ సవరణ ప్రకారం పోలీసు కస్టడీలో వున్నపుడు స్త్రీపై అత్యాచారం జరిగితే, అది స్త్రీ అంగీకారం లేకుండానే జరిగినట్టుగా కోర్టు భావించితీరాలి. కాబట్టి యిక్కడ స్త్రీ శీలానికి సంబంధించిన ప్రశ్న కోర్టువారికి అనవసరం. అందులో భాగంగానే సుమన్‌రాణి కేసులో సెషన్స్‌కోర్టు, పోలీసు ప్రతాప్‌సింగ్ యిచ్చిన సాక్ష్యాధారాల సహాయంతో మానభంగానికి పాల్పడిన యిద్దరు పోలీసులకు పది సం॥రాలు కఠినకారాగార శిక్షను (IPC Section 376) విధించింది. దీనినే హైకోర్టు కూడా ధృవపరచింది.

కాని సుప్రీంకోర్టు మాత్రం జస్టిస్. బి.సి. రే, యస్.ఆర్. పాండియన్ నాయకత్వంలో యిద్దరు పోలీసులకు విధించిన కఠినకారాగారశిక్షను పది సం॥రాల నుంచి ఐదు సం॥రాలకు తగ్గిస్తూ తీర్పునిచ్చింది. ఈ శిక్షను తగ్గించడానికి గల కారణాలను చెప్పేటప్పుడు, నేరశిక్షాస్మృతిని పక్కకుపెట్టి, తమ మనస్తత్వాన్ని బట్టి (కోర్టు పరిభాషలో అది జడ్జీల విచక్షణాధికారం కావచ్చు. కాని అదైనా హేతుబద్ధంగా వుండాలి కదా!) నేరాన్ని అంచనా వేశారు. శిక్షను తగ్గించడానికి, సుమన్‌రాణి శీలం ప్రశ్నించదగినదిగాను Questionable Character) మరియు పురుషులకు తేలికగా లొంగిపోయే స్వభావం గలదిగాను (easy virtue) వుండడమే కారణంగా చెప్పారు.

గతంలో ఎన్నడూ ఈవిధమైన కారణాలతో, యింత అమానుషమైన రీతిలో స్త్రీలకు సంబంధించి తీర్పు యివ్వలేదు. ఈ తీర్పుతో పోలీసుల విచ్చల

విడితనం మరింత ఎక్కువవుతుంది. అంతంతమాత్రంగా స్త్రీలకు లభిస్తున్న భద్రత కూడా కరువవుతుంది.

ఈ తీర్పును న్యాయశాస్త్ర నిపుణులే తీవ్రంగా దుయ్యబట్టారు. వారి ప్రకారం నిందితులు నిర్దోషులు కాదని ఒకసారి సుప్రీంకోర్టు భావించినపుడు, అంటే నేరం చేశారని (దోషులని) గుర్తించినపుడు, ఇంకా వివరంగా చెప్పుకోవాలంటే, బాధితురాలు- సుమన్‌రాణి - అంగీకారం లేకుండానే బలవంతంగా లైంగిక తృష్ణను నిందితులు తీర్చుకున్నపుడు, దానిని మానభంగ నేరంగా గుర్తించి శిక్షించాల్సినపుడు - కేవలం 'శీలం' కలిగిన స్త్రీలే మానభంగానికి గురిఅవుతారని చెప్పడంలో అర్థం లేదు.

ఈ కేసులో నిందితులైన పోలీసుల తరపున వాదించిన లాయర్ చాలా శ్రమతో చేయించిన వైద్యపరీక్ష ఫలితాలను ఆధారం చేసుకొని, బాధితురాలు శారీరక సుఖాలకు అలవాటుపడిందని వాదించారు. తన వాదనను ముగిస్తూ, ఆమెకు స్నేహితుడు వుండడం వలన ఆమె 'శీలం ప్రశ్నించదగినదిగాను, తేలికగా పురుషులకు లొంగిపోయే స్వభావంతో, కామంతో కూడిన ప్రవర్తన కలిగినటువంటిదిగా' వర్ణించారు. ఈ వాదనతో ఏకీభవిస్తూ న్యాయమూర్తులిరువురూ పై వాక్యాలనే తమ తీర్పులో పేర్కొన్నారు. ఆ తీర్పు సంక్షిప్తంగా ఈ క్రింది విధంగా వుంది : ఈ రాజ్యం నుంచి, ఈ రాజ్యానికుండే చట్టాల ద్వారా రక్షణ, న్యాయం స్త్రీ కోరేటట్లయితే తన కన్నెరికాన్ని పదిలంగా వుంచుకోవాలి.

ఈవిధమైన తీర్పు రావడానికి కారకులెవరోకాదు, ఎంతో సామాజిక చైతన్యం వుందని అనుకుంటున్న ఢిల్లీలోని పౌరహక్కులసంఘం అధ్యక్షుడుగా వుంటున్న (PUDR) గోవింద్ ముఖోతీ.

ప్రజాధనంతో పనిచేస్తున్న పోలీసులు, ప్రజలకు భద్రత కల్పించాల్సిన పోలీసులు తమ 'రక్షణ నిలయం'లో నిరాధారంగా వున్న ఒక స్త్రీపై (ఆమె వ్యభిచారి కావచ్చు. ఆమెకు అనేక మందితో సంబంధం వుండవచ్చు - అది ఆమె వ్యక్తిగతమైనది) ఆమెకున్న బలహీనతల పేరుతో, ఆ సందర్భంలో ఆమె యిష్టానికి వ్యతిరేకంగా మానభంగానికి పాల్పడితే అది స్త్రీ స్వేచ్ఛపై, స్త్రీ శరీరంపై, స్త్రీ మనస్సుపై అధికార యంత్రాంగం జరిపిన దాడిగా భావించవలసిందిపోయి, పోలీసుల తరపున వాదిస్తూ, ఒక స్త్రీ శీలాన్ని వైద్యపరీక్షలతో ఋజువుపరచి, అధికార యంత్రాంగాన్ని తన వాదనలో వెనకేసుకురావడంలో పౌరహక్కుల నాయకుడుగా ముఖోతీ ఉద్దేశ్యమేమిటి? తన సంఘ సభ్యులు,

# సాహిత్యంలో ప్రమాణాలు

—వెల్చేరు నారాయణరావు

"షేక్స్పియర్‌కి, తనకి ఉన్న కవితా సామర్థ్యంలో ఏమీ తీసిపోని ఒక చెల్లెలో అక్కో ఉందనుకోండి అవిడ ఏమయుండేది?" అని ప్రశ్న అడిగింది వర్జీనియా వుల్ఫ్.

విక్టోరియారాణి కాలపు ఇంగ్లండులో స్త్రీలకి చదువుకునే అవకాశాలూ, రచనలు చేసే పరిస్థితులూ, ఆ రచనల్ని పదిమంది ముందూ పెట్టే వసతులూ ఉండేవికావు కాబట్టి, అలాంటి వాళ్ళెవరూ రచనలు, సమర్థత వున్నా చేసి రాణించలేకపోయారని చెప్పడానికి ఒక బలమైన మార్గంగా ఈ ప్రశ్న అడిగింది వర్జీనియావుల్ఫ్. దాదాపుగా అలాంటి ప్రశ్నే తెలుగు సాహిత్యానికి సంబంధించినంతవరకూ నేను అడుగుదామనుకుంటున్నాను.

"నన్నయ్య మహాభారతం మొదలుపెట్టగానే అతన్ని తీసికెళ్ళి, నాలుగు తన్ని జైల్లోపడేశారనుకోండి. తిక్కన్న సంస్కృతం నేర్చుకుంటాననగానే,

---

దేశంలోని యితర పౌరహక్కుల సంఘాలు, మహిళా సంఘాలు ఎక్కడికక్కడ తీర్పును ఖండించడంతో విధిలేని పరిస్థితులలో క్షమాపణ చెప్పారు. PUDR నుంచి హుందాగా తొలగిపోయారు. అంటే పౌరహక్కుల సంఘాలలో అనుభవం సంపాదించిన నాయకుల నుంచి కార్యకర్తలవరకు రాజ్యస్వభావాన్ని, అధికార యంత్రాంగాన్ని యింకా సానుభూతితో అర్థంచేసుకునేవారున్నారని భావించవలసి వుంది. ఈ ధోరణి భవిష్యత్తులో పౌరహక్కుల ఉద్యమానికి ప్రమాదకరమైనదిగా పరిణమించవచ్చు.

ఈ రాజ్యం యొక్క చట్టాలు, అధికార యంత్రాంగం ఏ విధంగా బూటక స్వభావాన్ని కలిగివున్నాయో విశ్లేషించి వివరించడంద్వారా, కోర్టులు ఏ విధంగా పాలకులకు, ధనికవర్గానికి పరిమితమైపోతున్నాయో ఋజువుపరచడంద్వారా, పార్లమెంటు అధికార యంత్రాంగం, కోర్టులు కొన్ని సందర్భాల్లో ప్రజాభిప్రాయాన్ని, ప్రజల నిరసనను, ప్రజాఉద్యమాలను అణచివేయడంలో ఏ విధంగా ఏకమై పనిచేస్తున్నాయో ప్రజలకు వివరించడంద్వారా పౌరహక్కుల సంఘం కర్తవ్యం కొంతవరకు పరిపూర్ణమవుతుంది అప్పుడే బూర్జువాచట్టాలపై, పాశ్చాత్యప్రజాస్వామ్య విలువలపై కుహనా మేధావులు పెంచుకున్న మోజును, భ్రమలను తొలగించి వారిలో సరియైన అవగాహనను కలిగించగలం.

వాడి పీక నులిమి గొంతు పెగలకుండా చేశారనుకోండి. ఎర్రాప్రగడ రాసిన పుస్తకాలు బయటికిరాగానే, ఆ తాటాకు పుస్తకాలు ఉన్నపళాన తీసికెళ్ళి మంటల్లో పడేశారనుకోండి తెలుగులో కవిత్రయం ఏమైవుండేది, మహాభారతం ఏమై వుండేది".

వర్జీనియావుల్ఫ్ అడిగిన ఆ ప్రశ్న వల్ల, పాశ్చాత్య సాహిత్య చరిత్రలో ఆడవాళ్ళ రచనలు ఎక్కువగా లేకపోవడానికి కారణం బలంగా ఊహకి అందుతుంది. ఇప్పుడు నేనడుగుతున్న ఈ ప్రశ్న వల్ల తెలుగుసాహిత్య చరిత్రలో బ్రాహ్మణధర్మాన్నీ, వైదికభావజాలాన్నీ, రాచరికవ్యవస్థనీ ఇంకా ఈ దరిమిలా అగ్రకులాల ఆధిపత్యాన్నీ ప్రతిపాదించి ప్రశంసించే సద్రచనలే, సత్కావ్యాలే 11వ శతాబ్ది నుండి 20వ శతాబ్ది తొలిరోజులవరకూ నిలిచివుండడానికి కారణం బోధపడుతుంది.

సాహిత్యచరిత్ర అంటే, సమాజంలో పైచేయిగా ఉన్నవాళ్ళు నిర్మించిన సాహిత్యచరిత్ర, అలా పైచేయిగా లేనివాళ్ళు అసలు చదువుకునే అవకాశాలే వుండవు. ఒకవేళ ఉండెటో, వాళ్ళు సాహిత్యం అని చెప్పడానికి తగినది రాయడానికి కావల్సిన అవకాశాలు, వెసులుబాట్లు ఉండవు. అవన్నీ ఎలాగో అలాగ సాధించుకుని కష్టపడి, ఒకరో, కొందరో సాహిత్య ప్రమాణాలని తమ కాలంలో అంగీకరించబడినస్థాయికి ఎదిగి పుస్తకాలు రాసినా, వాటిని అప్పటి అధికారవర్గాలు, ప్రభుత్వాలు బతకనివ్వవు.

ఇంతవరకు, ప్రపంచ సాహిత్యంలో ఎక్కడా స్పష్టంగా ఈ ప్రశ్న అడగబడలేదు. సాహిత్యచరిత్రకారులందరూ ఉన్న పుస్తకాల కథలు రాశారు, వాటి గుణగణాలను చర్చించారు, సిద్ధాంతాలను చేశారు. కొంత మార్క్సిస్టు చరిత్రకారులైతే, అప్పటి ఆ పుస్తకాలు ఆ కాలపు బలీయవర్గపు భావజాలాన్ని ఎలా ప్రతిఫలిస్తాయో కొండొకచో ప్రశ్నిస్తాయో వివరించారు. కాని, అణిచివేయబడ్డ వర్గాలకి ఏ రకమైన సాహిత్యం వుంది, ఆ సాహిత్యం ఎన్ని రూపాలుగా, ఏయే కాలాలలో అణిచివేయబడింది, అనే విషయం బయటికి వచ్చే పద్ధతిలో సాహిత్యపు ప్రశ్న ఎవరూ వేసుకోలేదు.

"సామాన్య ప్రజల చరిత్ర కావాలి" అని అడగ్గలిగేం గాని, అణిచి వేయబడ్డ ఆ ప్రజల కళారూపాల గురించి ప్రశ్న అడగడానికి మనకు అవకాశం లేకపోయింది. ఇందుకు కారణం లేనిదాని గురించి ప్రశ్నించడం ఎలాగా అనే సందేహం. షేక్స్పియర్‌కి అక్కో, చెల్లెలో లేదు. అంచేత ఆవిడ ఉండివుంటే,

ఆమె ఏమయివుండేది అని ప్రశ్న వెయ్యాలని మనకి తట్టదు. అలాగే అక్షరాలు రాని సామాన్య ప్రజలు, వాళ్ళ తరపున నిలబడి రాసిన రచయితలు, ఫలానా వాళ్ళు వున్నారని తెలిస్తే, వాళ్ళ పుస్తకాలు వుంటే, వాటిని గురించి అడగడం వీలయివుండేది. అలాంటి రచయితలు లేరుకదా? ఉన్న గొప్ప రచయితలు, నన్నయలూ తిక్కనలూ, షేక్స్పియర్లూ శ్రీనాధులే కదా? మామూలు ప్రజల్లోంచి మామూలు ప్రజల గురించి రాసిన గొప్ప కళాఖండాలు ఏమైనావుంటే చూపించండి అని తేలికగా వర్గస్వామ్యపు భావజాలానికి కాపలాకాసే సాహిత్య సిద్ధాంతులు అడగడానికి కూడా ఇందుకే వీలయింది. అంతకన్న ఒక అడుగు ముందుకు వెళ్ళి, గొప్ప సాహిత్యం ఏదైనా పదికాలాలపాటు నిలుస్తుందనీ, అలా నిలవనిది గొప్ప సాహిత్యం కాదు కాబట్టి, అలాంటి సాహిత్యం పోయుంటుందనీ, మనకు నన్నయ్యలూ, తిక్కనలూ గొప్ప రచయితలు కాబట్టి నిలిచారనీ, ఇంకొక ప్రతిపాదనకూడా సాహిత్యశాస్త్ర సిద్ధాంతంలో చెయ్యడానికి వీలయింది.

ఇప్పటి సాహిత్య చరిత్రల స్వరూపాన్నీ స్వభావాన్నీ ప్రశ్నించడానికి కలకాలం నిలిచేదే గొప్ప సాహిత్యమని చెప్పే సాహిత్యశాస్త్ర సిద్ధాంతపు సామాజికతత్వాన్ని ప్రశ్నించడానికి తెలుగుసాహిత్య చరిత్రలో ఇప్పుడు మనకొక గొప్ప అవకాశం దొరికింది. ఇరవైఏళ్ళ విరసం సాహిత్యచరిత్ర ఆ అవకాశాన్ని మనకిస్తుంది.

ఈ ఇరవైఏళ్ళలో విప్లవకవులుగా నిల్చినవాళ్ళెవరు? వాళ్ళలో సాహిత్యకారులుగా గుర్తింపబడి అందరికీ ఇష్టం ఉన్నా లేకపోయినా నిలబడగల్గిన వాళ్ళెవరు? అలా వాళ్ళు నిలబడ్డానికి ఏయే కారణాలు దోహదం చేశాయి?

ఈ ఇరవైఏళ్ళలో, విప్లవకవులు కాబట్టి, ఎన్కౌంటర్ల పేరుతో హత్యలకు గురైన వాళ్ళెంతమంది? వాళ్ళు హత్యచేయబడేనాటికి కవులుగా రచయితలుగా వాళ్ళ ఎదుగుదల ఏ స్థితిలో వుంది? వాళ్ళు మరో పదికాలాలపాటు బతికుంటే సాహిత్యకారులుగా ఏస్థాయికి ఎదిగుండేవాళ్ళు? విరసంలో సభ్యులైన కారణంగానూ, విరసం అనుసరిస్తున్న రాజకీయపంథాపట్ల అభిమానం వున్న కారణంగానూ, పోలీసులూ ప్రభుత్వమూ పెట్టే రకరకాల ఇబ్బందులకి గురైన వాళ్ళెవరు? వాళ్ళు రాసిన రచనలు ఇంకా ఏమైనా మిగిలివున్నాయా? కనీసం అసంపూర్ణ రచనలైనా వున్నాయా? ప్రభుత్వం కేసులు పెట్టిన వాళ్ళలో రచయితలు ఎంతమంది? జైళ్ళల్లో ఉన్నరోజుల్లో కోర్టులచుట్టూ తిరుగుతున్న రోజుల్లో, వారికి రచనలు చేయడానికిగాని, సాహిత్యంలో జరుగుతూన్న ఇతర

మార్పులు తెలుసుకోవడానికిగాని, తమ రచనలు ప్రకటించుకోడానికిగాని అవకాశాలు ఎన్ని వుండేవి?

హత్యలూ, జైళ్ళూ, నిషేధాలూ ఇలా వుండగా, ఇంకొక పక్క ఎంతమంది చవకబారు రచయితలకి, మధ్యరకం రచయితలకి అధికారవర్గం, దానికోసం పనిచేసే సాహిత్య సంస్థలు అకాడెమీ అవార్డులూ, జ్ఞానపీఠ బహుమానాలూ ఇచ్చి, సవాలక్ష చిల్లరసంస్థల్లో సభ్యత్వాలూ, ఉద్యోగాలూ ఇచ్చి తన కొమ్ము కాయించుకుంది. సాహిత్యంలో వాళ్ళే చెప్పుకోదగ్గ కృషి చేస్తున్నారని రకరకాలుగా ప్రజలకి చెప్పి, 'సాహిత్యం' అంటే ఇంతవరకూ వున్నటువంటి అభిప్రాయాన్ని ఎంత చాకచక్యంగా కొనసాగించింది?

సాహిత్యచరిత్ర యొక్క స్వరూపానికి ఇంత విపులంగా రుజువులతో, సాక్ష్యాలతో, సమాచారంతో సరయిన అర్థాన్ని చెప్పే అవకాశం తెలుగుసాహిత్య చరిత్రలో మొదటిసారిగా మనకు దొరికింది. అణిచివేయబడ్డ వర్గాలవారికి సాహిత్యం వుంది, వాళ్ళ సాహిత్యానికి ఒక చరిత్ర వుంది, దాన్ని ఎదగనివ్వక పోవడం వల్ల, ఫలానా ఫలానా రూపాల్లో అది ఆగిపోయింది. ప్రత్యామ్నాయ మార్గాల్లో ఆ సాహిత్యం, అవకాశం వున్న పరిస్థితులన్నిటినీ వినియోగించుకుని ప్రబలంగా ఎదిగింది. అలాంటి సాహిత్యం, అధికారవర్గంవారు ప్రామాణికమని భావించే సాహిత్యచరిత్రలో భాగం కాకపోవడానికి, వాళ్ళు ఏర్పరుచుకున్న ప్రమాణాలు కారణం. ఆ ప్రమాణాలు మార్చి, సాహిత్యచరిత్రలో అణిచివేయబడ్డ ప్రజల సాహిత్యానికి సాధికారమైన చోటు ఏర్పరచాలి అని మనం బలంగా చెప్పాలి.

నారాయణరెడ్డికి లక్షరూపాయల జ్ఞానపీఠం అవార్డు వస్తుంది. గద్దర్ తల మీద లక్షరూపాయల రివార్డు ప్రకటించబడుతుంది. కొన్నాళ్ళతర్వాత "ప్రామాణిక" తెలుగుసాహిత్య చరిత్రలో నారాయణరెడ్డిని గురించి రాయబడుతుంది. గద్దర్ పేరు విస్మరించబడుతుంది.

ఈ పొరపాటుకు తావివ్వకుండా ప్రజల సాహిత్యానికి సరయిన స్థానం కల్పించి, సాహిత్యచరిత్ర సిద్ధాంతాలని, రుజువులతో సాక్ష్యాలతో సాధికారికంగా సవరించడానికి ఇప్పుడు మనకో అవకాశం కలిగింది. అందుకు అవసరమైన అన్ని వివరాలనూ, సాక్ష్యాలనూ భద్రపరచడంమూలంగానూ, మనం ఈ అవకాశాన్ని వినియోగించుకోవాలి.

[1990 జనవరి 11, 12, 13 తేదీలలో 20 ఏళ్ళ విరసం మహాసభలకు వెల్చేరు పంపిన సందేశం పూర్తిపాఠం.]

# పాలకులు పాతిపెట్టే సత్యాల్ని త్వ్వితీసి పోరాట చరిత్రల్ని పదిలపర్చడమే నిజమైన సత్యాన్వేషణ

—"కళింగుడు"

అల్జీరియాలో పుట్టి క్యూబాలో విప్లవానికి విజయవంతంగా నాయకత్వం వహించి అక్కడ విప్లవ ప్రభుత్వంలో కూడా ప్రముఖ పాత్ర వహించిన గువేరా ఆపిమ్మట బొలీవియాలో విప్లవం నడపడానికి తరలిపోయి అక్కడ స్వయంగా గెరిల్లా పోరాటాన్ని నడిపారు.

అంకిత భావం గల అత్యంత సాహసవంతులైన గెరిల్లాయోధులు కొద్ది మంది పూనుకుంటే గెరిల్లాయుద్ధాన్ని విజయవంతంగా నిర్వహించి విప్లవాన్ని విజయవంతంచేయవచ్చుననే తన నమ్మకాన్ని గువేరా బొలీవియాలో ప్రత్యక్షంగా ఆచలుజరిపి ఆ ప్రయోగంలోనే అసువులర్పించారు.

గువేరా నాయకత్వంలో బొలీవియాలో గెరిల్లాపోరాటం కొద్దిమాసాలు మాత్రమే జరిగి సైనికంగా అణచివేయబడింది. బొలీవియా మధ్యఅమెరికాలో ఒక చిన్న దేశం. మన దేశంలో ఒక చిన్న రాష్ట్రంపాటి వైశాల్యంకూడా వుండదు. చాలా వెనకబడ్డ వ్యవసాయిక దేశం. అక్కడ ప్రభుత్వం ప్రత్యక్షంగా అమెరికా మద్దత్తుతోనే మనగగలుగుతుంది. అలాంటిచోట సాధనసంపత్తులన్నీ బయటి నుండే సమీకరించుకుని గెరిల్లాయోధులూ నాయకత్వమూ కూడా విదేశం నుండే వెళ్ళి అక్కడి కొండలు గుట్టలు ఆసరాచేసుకుని గెరిల్లాయుద్ధం ప్రారంభించారు. ప్లాను ప్రకారం ముందుగా గెరిల్లాస్థావరాలు ఏర్పాటుచేసుకొని దళసభ్యుల్ని దొరికినకాడికి రిక్రూట్ చేసికుని పోరాటం ప్రారంభించారు. కొద్ది మాసాలు మాత్రం నిలదొక్కుకొని, వేళ్ళమీద లెక్కపెట్టగలిగే కొద్ది పోరాటాలు మాత్రం చేసి మిలిటరీ బలగంచేతిలో ఓడిపోయి అంతరించిపోయారు. ఇలా అర్థాంతరంగా విషాదంగా ముగిసిపోయినా యీ సాహసిక ప్రయత్నం ఎన్నెన్నో పాఠాల నందించి ఉత్తేజాన్ని నింపగల గొప్ప అనుభవంగా మాత్రం నిలిచిపోయింది. సామ్రాజ్యవాద వ్యతిరేక విప్లవ దీక్షకూ సాహసానికీ గెరిల్లాపోరాటానికీ ఒక సంకేతంగా గువేరా గుర్తుండిపోతారు.

బొలీవియాలో గువేరా కథను యిద్దరు జర్నలిస్టులు స్పానిష్‌భాషలో యిరవయ్యేళ్ళ కిందటే చక్కని చిన్నపుస్తకంగా రాశారు. "ద గ్రేట్ రిబెల్ చి గువేరా ఇన్ బొలీవియా" అనే పేరుతో యీ పుస్తకం ఇంగ్లీషులో 1969లోనే అచ్చయింది.

ఈ పుస్తకం సాహిత్య విలువలకోసమో ఒక రాజకీయ సిద్ధాంతాన్ని సమర్థించడం లేదా పూర్వపక్షం చేయడానికో యిది రాయడంలేదని రచయితలు ముందుమాటలో అంటారు. అయితే యిందులో విప్లవ పక్షపాతం కాకున్నా కనీసం విప్లవాభిమానం నిండుగావున్న నిజాయితీ, లేదా రచయతల మాటల్లో చెప్పాలంటే సత్యంపట్ల న్యాయంపట్ల తిరుగులేని ఆకాంక్ష ప్రతి వాక్యంలోనూ స్పష్టంగా కానవస్తుంది. అమెరికా సామ్రాజ్యవాదంపై ఎడతెగని అసహ్యం కసీ, ప్రగాఢమైన లాటిన్ అమెరికన్ జాతీయ భావం యీ పుస్తకంలో ఆద్యంతం కొట్టివచ్చినట్లు కన్పిస్తాయి.

1967 లో బొలీవియాలో గెరిల్లా కేంద్రాన్ని నెలకొల్పి గువేరా అక్కడ నిర్వహించిన రాజకీయ సైనిక కార్యకలాపాలనూ ఆ కేంద్రం ఆధ్వర్యంలో జరిపిన గెరిల్లాదాడుల్నీ అది జరిగిన క్రమంలోనే పునర్నిర్మించి చాలా ఆసక్తి కరంగా చెప్పారు.

కథకు ప్రవేశికగా బొలీవియా చరిత్ర గువేరా పుట్టుపూర్వోత్తరాలు క్యూబాలో ఆయన పాత్ర స్థూలంగా తడివారు.

గెరిల్లాలకు బొలీవియా సైన్యానికి మధ్య జరిగిన అయిదారు సాయుధ ఘర్షణల్ని స్థలకాలాలతోసహా అవి జరిగిన క్రమంలోనే వర్ణించిచెప్పారు మేపు దగ్గరుంచుకుని టెర్రియిడ్ అర్థంచేసుకొంటూ చదివితే గెరిల్లా చర్యలకు సంబంధించిన పాఠాలు తీసుకోగలిగేటంత లోతుగా వివరించారు.

ఆయా ఘటనలు జరుగుతూవుండగా ఆనాడే పేపర్లలో వచ్చిన వార్తలు కథలు ప్రభుత్వ ప్రకటనలు ఆనాడు ప్రజల్లో ప్రచారం పొందిన రూమర్లు వగైరా ఎన్నో వనరుల్ని తవ్వితీసి అందులో సంబంధం వుండిన ఎందరో అధికార అనధికార వ్యక్తుల్ని యింటర్వ్యూలుచేసి దొరికిన సమాచారమంతా బేరీజు వేసి యీ కథను పునర్నిర్మించారు. ఫోటోఫేపరుకు వుండే బలంతోపాటు గడ్డునేలను ఒవ్వి మంచినీరు పైకి తెచ్చినట్టు లోతైన ప్రభావంకలిగించే సుగుణం కూడా వున్న రచన పొగడ్తలు తిట్లూ లేకుండా అతిశయోక్తులు పదాడంబరమూ లేకుండా నిజాన్ని సూటిగా ఆవిష్కరించగలిగితే రచన ఎంత బలంగా వుంటుందో యీ చిన్న పుస్తకం చూస్తే తెలుస్తుంది.

బొలీవియాలో యీ తిరుగుబాటు ఓడిపోవడానికి ఒక ముఖ్యకారణం రైతుల మద్దతు లేకపోవడమే. పుస్తకం అంతటా ఆ సంగతి దాపరికంలేకుండా కనపడుతూనేవుంటుంది. ఈ విషయంలో గెరిల్లాలకు ఎంత కోరికవున్నా వారి కృషి మాత్రం అందుకు తగ్గట్టు లేకపోవడమే యీ వైఫల్యానికి కారణం. రైతులపట్ల గెరిల్లాలకు సద్భావం వుండడం, గెరిల్లాల సచ్ఛీలలను సత్ప్రవర్తనను రైతులు మెచ్చుకోవడం మాత్రమే సరిపోవు పోరాటాన్ని రైతులు స్వంతంచేసుకుని స్వయంగా ఆ గోదాలోకి దిగకపోతే గెరిల్లాల కాళ్ళకింద భూమి గట్టిగా లేనట్టే. ఇది లేకుంటే గెరిల్లాపోరాట విజయం సంగతటుంచి గెరిల్లాలకు మనుగడే దుర్భరం. సూత్రంగా వల్లించనవసరం లేకుండా యీ సంగతి మనస్సుకు హత్తుకునేలాగ చెప్పిందీ కథనం.

గెరిల్లా పోరును రైతులు సమర్థించలేదంటేనూ చివరకు గెరిల్లాలను పట్టించినసమాచారం రైతులే అందించేరంటేనూ రైతులకు సామ్రాజ్యవాదం పట్ల భక్తి ప్రపత్తులు ప్రభుత్వంపైన ప్రేమా వున్నాయనుకుంటే పొరపాటే. పీడితులు తమ విముక్తిమార్గం గురించి చైతన్యవంతులు కానంతవరకూ పీడకులు వారివేళ్ళతో వారికళ్ళనే పొడిపించడంలో కృతకృత్యులవుతారు.పీడకుల పట్ల కసీ తమ మేలుకోరేవారి పట్ల ప్రేమా వుండినప్పటికీ కూడా రైతాంగం చైతన్యవంతంకానిదే అవన్నీ నిష్ఫలమే అయిపోతాయి. అందుకు రైతుల్నీ సామాన్య ప్రజానీకాన్నీ నెపపెట్టి లాభంలేదు. గువేరాను బొలీవియా రైతులు యిప్పుడు సెయింట్ (ఋషి) అని ఆరాధిస్తూ యిళ్ళల్లో దేవుడిపటాల సరసన ఆయన ఫోటోలు పెట్టుకుంటున్నారు. ఆయన చనిపోయిన పదిరోజులకు ఆ వూళ్లో ఆదివారం జరిగే సంతలో ఆయన ఫోటోలు ఆరేడువేలు అమ్ముడు పోయాయట,

సిద్ధాంత రాద్ధాంతాల్లో తలమార్చం అని చెప్పుకున్నారు రచయితలు. కాని స్మృతి - ఆశ అనే చివరి అధ్యాయంలో గువేరా దేనినీ పిడివాదంగా పట్టుకువేలాడ లేదని చెబుతూ 'విప్లవ సిద్ధాంతం లేనిదే విప్లవం లేద'నే లెనిన్ బోధనను గువేరా తోసిపుచ్చలేదంటూ, "విప్లవసిద్ధాంతం అంటే సామాజిక సత్యం యొక్క వ్యక్తీకరణ తప్ప అందు గురించి సిద్ధాంత సూత్రాల వల్లావన మాత్రమేకాదనీ, చారిత్రక సత్యాన్ని సరిగా అవగాహనచేసుకొని చారిత్రక శక్తుల్ని సవ్యంగా వినియోగపెట్టగలిగితే, సిద్ధాంతజ్ఞానం కొరవడినాసరే, విప్లవం జరిగితీరుతుందని" గువేరా గ్రహించగలిగాడని రాశారు. సిద్ధాంతం - ఆచరణల విడదీయరాని సంబంధం గురించి మార్క్సిజం చెప్పేది అదేకదా.

దీర్ఘకాల ప్రజాయుద్ధంలో గెరిల్లాయుద్ధం ఒక పోరాటరూపంగా ఎంత ప్రాముఖ్యత పొందినప్పటికీ గెరిల్లాయుద్ధమే సర్వస్వం కాదని గుర్తించడానికి యీ కథ కొంతమేరకైనా తోడ్పడుతుంది.

శత్రుబలాధిక్యంవల్లనూ, గెరిల్లాల లోపాలమూలంగానూ ఒక పోరాటం ఓడిపోయినప్పటికీ న్యాయంకోసం మంచి సమాజంకోసం వారు చేసే త్యాగాలు మణిదీపాలై భావితరాలకు వెలుగునిస్తాయి. దోపిడీవర్గాలు సైతం సాంఘిక న్యాయం గురించి మాటాడక తప్పనివిధంగా యీ త్యాగశక్తి బలవంతంగా వాళ్ళ మెడలు వంచుతుంది.

తిరుగుబాటును అణచివేశాక ఆ విజయానికి అభినందనలు చెప్పడానికి బొలీవియా పార్లమెంటు ఒక ప్రత్యేక సమావేశం జరిపితే ప్రతిపక్షాలు అధికార తీర్మానాన్ని బలపర్చకుండా విజయానికి కేవలం సైన్యాన్ని మాత్రం అభినందిస్తూ తిరుగుబాటుకు దారితీసిన సామాజిక పరిస్థితుల్ని చక్కబర్చనందుకు ప్రభుత్వాన్ని అభిశంసిస్తూ మరొక తీర్మానం పెట్టి సభనుంచి వాకౌట్ చేశాయి.

అలాగే దేశానికంతా మతాధికారి అయిన బిషప్పు, తిరుగుబాటును సాయుధంగా అణచివేయడాన్ని ఒకవంక సమర్థిస్తూనే, గెరిల్లాలు ఏ సాంఘికన్యాయం కోసం చనిపోయారో ఆ న్యాయాన్ని స్థాపించడం తప్ప వేరే పరిష్కారమార్గం లేదని చెబుతూ గెరిల్లాల ఆత్మశాంతికి దేశవ్యాప్తంగా ప్రార్థనలు జరపమని ఉత్తర్వులిచ్చాడు.

అంతమాత్రమే కాదు, గెరిల్లావీరులపట్ల దేశప్రజల్లో ఎంతగానో ప్రశంస వెల్లువికింది. కొచబాంబా లోకల్ యూనివర్శిటీ ఫెడరేషన్ గువేరా చనిపోయిన నాలుగోనాడే ఒక తీర్మానం చేసింది. అందులో, సాంఘికన్యాయంకోసం పోరాడే ప్రపంచ యువతకు గువేరా సంకేతం అని పేర్కొన్నారు. ఆయనకు బొలీవియా పౌరసత్వం ఇస్తూ, ఆయన మృతికి సంతాపదినాలు ప్రకటిస్తూ, విద్యార్థి వారోత్సవాలలో సాంప్రదాయిక నాట్యవినోదాన్ని రద్దుచేసి బొలీవియా యువత ప్రపంచ యువతరానికి తన సానుతాపాన్ని తెలియజేస్తూ యీ వుత్సవాలు జరుపుతామని, యీ తీర్మానంలో విద్యార్థులూ వుపాధ్యాయులూ కలిసి ఏకగ్రీవంగా చాటిచెప్పారు.

ఈ విషయాలన్నీ యీ పుస్తకంలో కేవలం సమాచారాన్ని అందించే పద్ధతిలోనే రాసినా వాటి స్ఫూర్తి ప్రభావం పాఠకుడిమీద బలమైన ముద్రవేస్తాయి అదే యీ కథనరీతిలోని బలం. ఉదాహరణకు యీ కథనంలో భాగంగా గువేరా

తల్లిదండ్రులకు తన పిల్లలకు రాసిన జాబులు తల్లి ఆయనకు రాసిన జవాబు అలాంటివే మరికొన్ని ఈ పుస్తకంలో చేర్చారు. (వాటి అనువాదాలు యీ పరిచయం చివర చేర్చాం.)

గజిబిజిగా చెల్లాచెదురుగా పడి తెరమరుగు కూడా అయిపోయిన ఎన్నో పుస్తకాలను వెతికిపట్టుకొని వాటి సారాన్ని పరిశోధించి నిజాన్ని వెలికితీసి పాఠకుడి ముందుంచిన వైనం నిజంగా మెచ్చుకోదగింది. నిజాన్ని వెలికితీయడమంటే కేవలం సాక్ష్యాధారాలు పట్టుకుని పీడకుల అబద్ధాల్ని నిర్ధారించడంకాదు; చారిత్రక సత్యాన్ని వెలికితీసి ఆనాటి చరిత్రలో పురోగమన శక్తులకు స్ఫూర్తి విస్తూ వాటిని సమగ్రంగా ప్రదర్శించాలి. ఈ కథనం ఆధోరణికి అద్దంపడుతుంది.

యుద్ధభూమిలో బందీగాపట్టుకుని గువేరాను రెండురోజుల తర్వాత కాల్చి చంపింది సైన్యం. పోరాటంలో చనిపోయాడని ప్రభుత్వం అబద్ధపు ప్రకటన చేసింది, ఇందులో అమెరికా గూఢచారి సంస్థ CIA కి కూడా ప్రత్యక్షపాత్ర వుంది. ఈ నిజాన్ని బొలీవియా అధ్యక్షుడు అమెరికా వుపాధ్యక్షుడికి ప్రయివేటుగా చెబుతాడు. అతడు ఒక జర్నలిస్టుతో ఏదో విందులో నోరుజారుతాడు. అలాంటి వెలుగుచూడని ఎన్నో చీకటి కోణాల్లోకి దూసుకుపోయి నిజాన్ని తవ్వి తియ్యడంలో యీ రచయితలు చూపిన ప్రొఫెషనలిజం పాఠకుణ్ణి ముగ్ధుణ్ణి చేస్తుంది. ఇంత చక్కగా యీ తిరుగుబాటు గాథని గ్రంథస్తం చేసి పదిలపర్చి ముందుతరాలకందించిన యీ యిద్దరు జర్నలిస్టులూ ఎంతయినా అభినందనీయులు.

ఈ బొలీవియా తిరుగుబాటు జరిగింది నిండా మూడునెలలు. గువేరా చనిపోయింది 1967 అక్టోబర్‌లో. బొలీవియాలో యీ తిరుగుబాటు ఎంత సంచలనాన్ని రేపినా పర్యవసానంగా చెప్పుకోదగ్గ సాహిత్యోద్యమమో సాంస్కృతికోద్యమమో వచ్చినట్టు మాత్రం దాఖలాలు లేవు. సాహిత్యరంగాన్ని కుదిపేసే అటువంటి వుద్యమం లేకపోయినా వ్యక్తులుగా జర్నలిస్టులు చేసిన ప్రయత్నం మరింత శ్లాఘనీయం.

మనదేశంలో నక్సల్బరీ వసంత మేఘగర్జనా, శ్రీకాకుళ పోరాట ప్రారంభమూ సుమారుగా ఆకాలానికి చెందినవే. దేశాన్నే ఓ పెద్ద కుదుపు కుదిపి ప్రపంచ దృష్టిని ఆకట్టుకున్న యీ విప్లవతరంగం సాహితీసాంస్కృతిక రంగాలను కూడా ఎంతగా విప్లవీకరించిందో ప్రత్యేకంగా చెప్పుకోవలసినపనిలేదు. విప్లవ సాహితీ సాంస్కృతిక సంస్థలు కూడా పుట్టిపెరిగి బలంపుంజుకుని తమ

కంటూ చరిత్రలే సృష్టించుకున్నాయి. ఉద్యమప్రభావంతో విప్లవ సాహిత్యం కూడా పెద్ద ఎత్తునే పుట్టుకువచ్చింది కూడా అలాగే మన విప్లవ పోరాటాల్లో కూడా లెజెండ్స్‌కు కొదవలేదు.

కాని మన నక్సల్బరీ, శ్రీకాకుళ పోరాటాలను అన్ని కోణాలనుంచీ ప్రదర్శిస్తూ సమగ్రంగా జరిగింది జరిగినట్లు రికార్డుచేసే డాక్యుమెంటేషనో, నెరేటివో యిప్పటివరకూ ఎవరూ ఎందుకు రాయలేకపోయారు. గువేరాను గురించిన పై పుస్తకం చూసినప్పుడు యీ ప్రశ్న మన గుండెల్ని పట్టుకుంటుంది. నక్సల్బరీతరం పోరాటాలు జరుగుతున్న చరిత్ర, అవి ముగిసిపోయిన బొలీవియా తిరుగుబాటుకోవకు చెందవు, వీటిని రికార్డులో పట్టుకోవడం పుస్తకంలో చూపెట్టడం తేలికకాదని మనకి మనం చెప్పుకోవచ్చు. కాని అది మన మనస్సునైనా జోకొట్టగలదా?! పోరాటం జరుగుతున్నప్పుడు పోరాడడమే తప్ప రాయడం సాధ్యంకాదు, ఆతర్వాతనే కవిత్వం వచ్చేది అని లూసన్‌ని అడ్డు పెట్టుకుందావన్నా శాంతిదొరకదు.

మహత్తరమైన పోరాటగాథలు కాలంగడిచి తెరమరుగైపోకముందే మేలుకుని వాస్తవాన్ని ఒడిసిపట్టుకుని అక్షరరూపం యివ్వాలి. మన సాహితీ ద్రష్టలు మన చరిత్రకు న్యాయంచేయకపోరనే ఆశిద్దాం.

## అసంబంధాలు

### 1

1965 ఫిబ్రవరిలో జరిగిన రెండవ ఆఫ్రో ఏసియన్ సెమినార్‌కు గువేరా క్యూబా ప్రభుత్వ ప్రతినిధిగా హాజరయారు. మార్చి 14 న తిరిగి హవానా చేరుకున్న వెంటనే తల్లికి ఒక జాబురాస్తూ ఒక నెలరోజులు చెరుకుపొలాల్లో పని చెయ్యదల్చుకున్నాననీ అటుపిమ్మట అయిదేళ్ళపాటు ఏదో ఒక ఫ్యాక్టరీలో పని చెయ్యదల్చుకున్నాననీ రాశాడు గువేరా. దానికి గువేరా తల్లి రాసిన జవాబు

మై డియర్!

నా జాబులు నీకు వింతగా కనిపిస్తున్నాయా? మనం ముఖాముఖీగా మాట్లాడుకున్న రోజులనాటి సహజత్వం యిప్పుడు మన మధ్య లేదేమో?! లేక, మన మధ్య అలాంటి సహజత్వం ఏనాడూలేదా; మనం ఎప్పుడూ నర్మగర్భంగానే మాట్లాడుకున్నామా? ఏమో! ఈ నదీతీరాన వుంటూ వచ్చిన మన కుటుంబ సంభాషణల్లోనే యీ గుంభనా గూఢత్వమూ నిండిపోయాయో, ఏమో!

ఈ ఆందోళనలోనే నేను యీ గుంఫనమైన ధోరణిని విడిచిపెట్టి, డొంక తిరుగుడు లేకుండా నీతో సూటిగా మాటాడదల్చుకున్నాను. నా ప్రత్యుత్తరాలు నీకు సవ్యంగా అర్థంకానందువల్లనో యేమో అవి నీకు వింతిగా అయోమయంగా కన్పిస్తున్నాయి.

మన ఉత్తరప్రత్యుత్తరాల్లో మనం అవలంబించిన యీ దౌత్యమర్యాదల ధోరణి మూలంగానే నేను కూడా నీ జాబుల్లో పంక్తుల మధ్య నిక్షిప్తంగా వుండే భావాలకోసం వెతుకులాడుకుంటూ వ్యాఖ్యానాలు చేసుకోవలసివస్తూంది. బ్యూనస్ ఏరిస్ నుండి వెలువడే పత్రికల్లో వార్తలు చదువుకునేటప్పుడు అసలైన అర్థాల కోసం తరచిచూసుకుంటూ ప్రతి వాక్యానికీ నిజమైన భావం ఏమిటా అని వెతుక్కుంటూ ఎలా తాపత్రయపడతామో అలా ప్రయత్నపూర్వకంగా ప్రయాసపడి చదువుకోవలసివచ్చింది నీ కిందటి జాబు?

ఫలితం ఏమిటంటే మరింత గందరగోళం, మరింత ఆందోళన, మరింత వ్యధ.

నేను దౌత్యభాష వాడదల్చుకోలేదు. సూటిగానే రాస్తాను. క్యూబాలో నిర్మాణ కౌశల్యంగలవారు అసలే చాలా తక్కువగా వున్నప్పుడు, వారంతా చెరకునరికే పనిని ఓ నెలరోజులు ప్రధానవ్యాపృత్తిగా పెట్టుకోవాలనుకోవడం, అందునా ఆ పనిని మరింత చక్కగా చేయగల ప్రజలు పుష్కలంగా వుండగా, అది నిజంగానే పిచ్చితనం అని నాకనిపిస్తూంది. విశ్రాంతి సమయాల్లోనో లేదా వినోదంకోసమో ఏ శని ఆదివారాల్లోనో అలాంటి పనిచేస్తే అది వేరే సంగతి. క్యూబాలో ప్రతి టన్ను చెరకు మీదా వచ్చే విదేశీమారకద్రవ్యం ఎంతో విలువైనది కాబట్టి, చెరకు నరకడానికి యంత్రాలు వుపయోగించడం ఎంత లాభసాటిగా వుండగలదో ఎంత ఆవశ్యకమో నిరూపించడానికి ఎవరైనా ఆపనిలోకి దిగినా కొంత అర్థంచేసుకోవచ్చు.

నెలరోజులు చాలా ఎక్కువకాలం. నీ నిర్ణయం వెనక బహుశా నాకు తెలీని కారణాలేవైనా వున్నాయేమో. ఇక నీ స్వంత విషయానికొస్తే, యీ నెల రోజుల పని తర్వాత నీ శ్రమను ఒక ఫ్యాక్టరీ నడిపించడానికి వెచ్చిస్తావంటే, అందునా ఆ పని జయప్రదంగా చేయగలవాళ్ళు ఎందరో వుండగా, ఇది నిజంగానే నాకు శుద్ధ అసందర్భంగా పూర్తిగా పిచ్చిపనిగా అనిపిస్తోంది. ప్రత్యేకించి నిజమైన ఆదర్శంగా నిలిచేందుకు యీ పని అయిదేళ్ళపాటు చేస్తాననడం - అంతకంటె పిచ్చితనం మరొకటి లేదు.

విదేశంలో మకాం కొద్దిరోజులుపొడిగించే నీ మంత్రిత్వశాఖ పనికి దూరమైపోయినందుకు నువ్వు ఎంత గిలగిల్లాడిపోయావో నేనెరుగుదును. అందుకే నాకు అనుమానంగావుంది, నేను క్యూబా వచ్చేసరికి నా ఎర్నెస్టో యింకా పరిశ్రమల మంత్రిగా పనిచేస్తూవుంటాడా అని. ప్రజల్లో కష్టపడి పని చెయ్యాలనే తపనను ప్రోత్సహించేది ఏమిటనే వివాదంలో ఎవరి వాదం నెగ్గింది ఏది సరైందని తేలింది.

ఈ ప్రశ్నలకు పూర్తి జవాబుల్లేవు. నువ్వు ఫ్యాక్టరీనడపడానికి పోతానంటే యిక నువ్వు మంత్రిగా కొనసాగవనే అర్థం. నీ స్థానంలో ఎవరు వస్తారనే దానిపై ఆధారపడే ఆ వివాదం సవ్యంగా తెలివిగా పరిష్కరింపబడిందా లేదా అనే విషయం తేల్చుకోవాలి. ఏది ఏమైనా నువ్వు అయిదేళ్ళు ఫ్యాక్టరీలో పనిచేయడమంటే నీ శక్తిసామర్థ్యాల్ని నీ కౌశలాన్నీ విపరీతంగా వృథాచేసుకోవడమే. ఈ మాటలు అంటున్నది నీతల్లిగా కాదు. ఈ ప్రపంచమంతా సోషలిజంలోకి మారడం త్వరగా జరగాలని ప్రగాఢంగా కోరుకునే ఒక ముసల్ది చెప్తున్న మాటలివి. నువ్వనుకుంటున్నట్టే చేయడమంటే ప్రపంచ సోషలిజానికి చేయగలిగిన సేవ చేయకుండాపోవడమేనని నేననుకుంటున్నాను.

ఒకవేళ, ఏవోకారణాంతరాలవల్ల, యికపై నువ్వు క్యూబాలో పనిచేసే దారేలేకపోతే, అల్జీరియా ఆర్థికవ్యవస్థను చక్కబరుస్తే సంతోషంగా ఆహ్వానించే బెన్‌బెల్లా వున్నాడు, లేదా అంతేగానూ ఆదరించగల సుక్రుమా మరో ఘనాలో వుంటాడు. అయితే అప్పుడూ అక్కడ కూడా నువ్వు పరాయిదేశంవాడివే. ఇది నీకు ఎప్పుడూ తప్పదేమోననే నాకనిపిస్తోంది ...

## II

క్యూబానుండి అర్ధాంతరంగా అదృశ్యమైపోయేముందు తల్లిదండ్రులకు గువేరా రాసిన జాబు.

ప్రియమైన అమ్మకి, నాన్నకి!

మళ్ళీ నేను నా డాన్‌క్విక్సోట్ గుర్రం ఎక్కేస్తున్నాను. డాలు చేబూని నేను మళ్ళీ దేశాలవెంబడి పడుతున్నాను.

మరింత గొప్ప సైనికుణ్ణి మరింత గొప్ప డాక్టర్ని కాలేకపోయినందుకు విచారిస్తూ పదేళ్ళకిందట యిలాంటిదే యింకో వీడ్కోలు లేఖరాశాను మీకు. నాకిప్పుడు గొప్ప డాక్టర్ని కావాలనే ఆసక్తిలేదు. ఇక యోధుడిగానంటే నేను మరీ అంత తీసికట్టేమీకాదు. మొత్తంగాచూస్తే, సారాంశంలో పెద్దతేడాలేదు.

కాకుంటే, నా చైతన్యం మరింత పెరుగయింది. నా మార్క్సిస్టు విజ్ఞానపు పునాది మరింత గట్టిపడింది. మరింత రాటు దేలింది స్వాతంత్ర్యంకోసం పోరాడే ప్రజలకి సాయుధపోరాటం ఒక్కటే మార్గమని నేను గట్టిగానమ్ముతున్నాను. నేను నమ్మినదానికోసమే పాటుపడతాను, కొందరు నన్ను దుస్సాహసికుణ్ణే అన వచ్చు. నిజమే. నేను దుస్సాహసికుణ్ణి, కాని ఒకటే తేడా. నిజమని నమ్మిన దాన్ని నిరూపించడానికి ప్రమాదాలకు ఎదురొడ్డడానికి వెరవని సాహసికుల కోవ నాది.

ఇదే తుది కావచ్చు. అలాకావాలని నేనేమీకోరుకోపడంలేదు. కాని సాధ్యా సాధ్యాలు పరిగణిస్తే నాకదే అనిపిస్తోంది. అలాగే జరిగితే యిదే మీకు నా చివరి కౌగిలి.

మీరంటే నాకు చాలా ప్రేమ. కాకపోతే నా ఆప్యాయతను ఎలా వెలి బుచ్చాలో నాకు తెలీదు. ప్రవర్తనలో నేను చాలా బిగదీసుకుపోయివుంటాను. ఒకోసారి మీరు నన్ను అర్ధంచేసుకోలేదేమోననిపిస్తుంది. నన్ను అర్థంచేసుకో వడం కష్టమేకూడా. ఇవాళ నేను చెప్పేది నమ్మండి.

ఒక కళాకారుడికి సహజమైన వుత్సాహంతో నేను నామనోబలాన్ని సాను బట్టాను. బలహీనంగా వుండే నా కాళ్ళనీ అలిసిపోయిన నా వూపిరితిత్తుల్నీ ఆ మనోబలం పట్టి నిలబెట్టగలుగుతుంది. చెయ్యవలసినదంతా నేను తప్పనిసరిగా చేసేతీరుతాను.

నన్ను అప్పుడప్పుడు గుర్తుచేసుకుంటూ వుండండి. అందరికీ ముద్దులు.

మీ గడుగ్గాయి చిచ్చరపిడుగు నుండి మరోమారు కౌగిలి.

మీ ఎర్నెస్టో.

## III

గువేరా బొలీవియాలో చనిపోయినప్పుడు ఆయన వస్తువుల్లో ఈ వుత్తరం దొరికింది. పిల్లలకు ఆయన యిచ్చిన వారసత్వం అదే.

నాప్రియమైన పిల్లలు హిల్దిత, అవలిత, కేమిలో, సిలియా ఎర్నెస్టోలకు-

ఎప్పుడైనా మీరు ఈ జాబును చదువుకోవలసివస్తే యిక నేను మీ మధ్య లేనుకాబట్టే.

మీకు నేను గుర్తుండడం కష్టమే. మరీ చిన్నవాళ్ళకి నేనసలే గుర్తుండను.

మీనాన్న ఎల్లప్పుడూ నమ్మినదాన్నే ఆచరించిన మనిషి. తన నమ్మ కాలకే కట్టుబడి మీనాన్న పనిచేశాడన్న సంగతిని ఎవ్వరూ కాదనలేరు.

సమీక్షలు :

# వీధి నాటకం విద్య

—కాకరాల

వీధి నాటకం ఈనాడు దేశంలో వుద్యమంగా వృద్ధిచెందుతోంది. వెనకటి వీధి నాటకానికి నేటి వీధి నాటకానికి నిర్మాణ విద్యలోనే తేడావుంది.

సంఘ జీవనంలో దాని సాంస్కృతిక రంగస్థలానికి 'విద్య' సూక్ష్మరూపం. విద్యా సంస్కృతులు సామాజిక పరివర్తనలో భాగంగా మారుతున్నాయి. వీధి నాటకంతోసహా దృశ్యరూపక పరివర్తనంతా అందులో భాగమే.

భారతదేశం మందగమనం చేస్తున్నా ప్రపంచంలో (రెండు ప్రపంచ యుద్ధాల మధ్యకాలంలో) ధనికవర్గ రంగస్థల ప్రత్యామ్నాయానికి బీజాలుపడ్డాయి. అందుకు ప్రపంచ పెట్టుబడిలోబాటు పెరుగుతూ వచ్చిన సినిమా ఓ విధంగా దోహదంచేసింది. అమెరికా (హాలీవుడ్) లాంటి పెట్టుబడి దేశాల్నించి వ్యక్తి ప్రధానమైన నిర్మాణధోరణులు వచ్చాయి విప్లవానంతరం సోవియట్ రష్యాలో ప్రత్యామ్నాయంగా ఐసెన్‌స్టీన్ సమిష్టి ప్రధానమైన మాంటేజ్‌సిస్టమ్ (అర్థవంతంగా దృశ్యాల్ని కూర్చే పద్ధతి) అమలులోకి తెచ్చాడు ఆ మాంటేజ్‌సిస్టమ్‌నే 'బ్రెష్ట్' నాటకరంగానికి అన్వయించాడు. ప్రత్యామ్నాయంగా 'ఎపిక్ థియేటర్'ని

---

మీరంతా మంచి విప్లవకారులుగా ఎదగండి. ప్రకృతిపై పట్టు సంపాదించి దాన్ని పూర్తిగా వశవర్తిని చేసుకోవానికి మనిషికి తోడ్పడేది సాంకేతిక జ్ఞానం. ఆ జ్ఞానంపై గట్టి పట్టు సంపాదించడానికి మీరు బాగా చదువుకోండి. విప్లవమే అన్నిటికంటే చాలా గొప్పదీ ముఖ్యమైనదీ అనీ, అది మినహా మనకు ఏ ఒక్కరికీ విడిగా యింకేమీ విలువలేదనీ గుర్తుంచుకోండి.

అన్నిటినీమించి, ప్రపంచంలో ఎక్కడైనాసరే ఎవరికైనాసరే అన్యాయం జరిగితే మీ హృదయం అందుకు స్పందించగల సామర్థ్యం పెంచుకోండి. విప్లవకారులకి యిదే అన్నిటికంటే మిన్నయైన గొప్ప సుగుణం.

పిల్లలూ యిదే చివరి వీడ్కోలు, మిమ్మల్ని మళ్ళీ చూడాలని నాలో యింకా ఆశ ....

ఓ పెద్ద ముద్దు. ఓ బిగి కౌగిలింత.

మీ నాన్న

ప్రతిపాదించాడు. అరిస్టాటిలియన్ థియేటర్‌కి ఎపిక్ థియేటర్‌కి వున్న తేడాని 'బ్రెహ్ట్' యిలా చెప్పాడు.

అరిస్టాటిలియన్ థియేటర్‌కి అభినయం, అనుభూతి ప్రధానం. ప్రతి దృశ్యం తరువాత వచ్చే దృశ్యానికి పునాదినివేస్తుంది. అంగవుపాంగాల అభివృద్ధి నిర్మాణాత్మకంగా జరుగుతుంది. వేదికమీది అభినయం తనలోకి ప్రేక్షకుణ్ణి నిమగ్నుణ్ణి చేసుకుంటుంది. అతని స్వీయచైతన్యాన్ని ఆచరణకి రాకుండా నాశనంచేస్తుంది. ఆవేశపూరితమైన అనుభవాల్ని పంచుకున్న ప్రేక్షకునికి అంతిమ ఫలితంగా నిర్దిష్ట పరిమాణంలో ఆసక్తికలుగుతుంది.

ఎపిక్ థియేటర్‌కి కథనం, మేధ (intellect) ప్రధానం. ప్రతిదృశ్యం స్వతంత్రమైంది. అన్ని దృశ్యాలూ మాంటేజ్ (అర్థవంతంగా దృశ్యాల్ని మార్చే పద్ధతి)లో వుంటాయి. ఇది ప్రేక్షకుణ్ణి పరిశీలకుణ్ణిచేసి అతని స్వీయ చైతన్యం ఆచరణకొచ్చేలా చేస్తుంది. ప్రపంచ దృక్పథాన్ని కల్గిస్తుంది. స్వయం నిర్ణయాలు చేసుకునేలా చేస్తుంది. ప్రదర్శన జరుగుతున్నపుడే మనిషి పరిశీలకుడై నేర్చుకుంటాడు.

ప్రపంచ విప్లవాన్ని ముందుకునడిపించాల్సిన భారతదేశంలో 1970 లో ప్రత్యామ్నాయ (శ్రామిక) రంగస్థల ప్రగతికి బీజాలుపడ్డాయి. వాటిలో భాగంగా బాదల్‌సర్కార్ వీధి నాటకం నిర్మాణవిద్యకి అంకురార్పణచేశారు. "భాషని (వ్యక్తీకరణని) మార్చుకుంటున్న రంగస్థలం" అనే వారి వ్యాసంలో ఈ నిర్మాణ విద్యకి దారితీసిన తన అవగాహనని ఆయన వివరించారు. బాదల్‌సర్కార్ ఆ వ్యాసంలో చేసిన ఆలోచనలు చూస్తే ఆయనకి స్ఫూర్తి 'బ్రెహ్ట్' ఎపిక్ థియేటరేనని తెలుస్తుంది. వేల సంవత్సరాల వీధినాటక ప్రతిమని ఎపిక్ థియేటర్ శాస్త్రీయ విశ్లేషణాశక్తిని జోడిస్తే ఆధునిక వీధినాటక నిర్మాణవిద్యకి ప్రాథమిక సూత్రాలొచ్చాయని అనుకోవచ్చు.

ఈ వీధినాటకం విద్యని అన్ని రాష్ట్రాలూ అందుకోవడంలో భాగంగా మనరాష్ట్రం కూడా అందుకుంది. ఆ నిర్మాణపద్ధతిలో 'భారతీయ విద్యారంగం' పరివర్తనని శాస్త్రీయంగా విశ్లేషించిన ప్రయత్నం జనార్ధనరెడ్డిగారి 'విద్య' వీధినాటకం.

భారతదేశంలో ధనికవర్గ ప్రయోజనాల్ని సాధిస్తూవస్తున్న రాజ్యం రాజులకాలం నుంచి రాజీవ్‌గాంధి కాలందాకా విద్యాసంస్కృతుల్ని యెలా వినియోగించుకుంటుందో చూపారు. అందువల్ల కలిగిన వెలుగుతున్న దుష్టపరిణా

మాల్ని సూచించారు. ముందుమాటలో, సి. రామ్మోహన్‌గారు చెప్పినట్టు వీధి నాటకం వుద్యమరూపానికొస్తున్న ప్రాథమిక దశల్లో కేవలం లోపాల్ని వెలికి తీయడం మంచిదిగాదు. అలాగని యేమీ చెప్పకుండా వూరుకోనూకూడదు. ఇలాంటి ప్రయత్నాలింకా అభివృద్ధిచెందేలా రచయితకి వుపకరించే సూచనల్ని సలహాల్ని యివ్వాలి. అలా విమర్శకులికి రచయితలకి మధ్య సజీవసంబంధం యేర్పడితేనే యీ వీధినాటకం వుద్యమానికి జవం జీవం పెరుగుతాయి.

ముందుమాటలో రచయితే చెప్పినట్టు 'విద్య' వీధినాటకం రెండు రంగ స్థలాల మిశ్రమం. చాలావరకూ వీధినాటకం లక్షణాల్తోనే నడిచినా అక్కడక్కడ అభినయం ప్రధానమైన ధోరణి చోటుచేసుకుని కథాకథనానికి కళ్లెంవేస్తుంది. అలాంటి చోట (వుదాహరణకి ఆరంభంలో) ప్రతిదృశ్యం ఆ తరువాత రాబోయే దృశ్యానికి (పాత పాత్రల పరిచయ పద్ధతిలో) పునాదిని సిద్ధంచేస్తుంది. ఇక శాస్త్రీయ విశ్లేషణకూడా దృశ్యాత్మకంగా కాక వాచ్యంగా (పాత్రల సంభాషణల్లోనే) జరిగింది. మొదటి రెండుమూడు పరిచయ దృశ్యాలయ్యాక మిగిలిన దృశ్యాలు వీలైనంతగా స్వతంత్రమై కథనవేగం పెరిగింది.

యవనికానాటకానికి అలవాటైన ప్రేక్షకులికి వీధినాటకాన్ని పరిచయంచేసే వారి దశల్లో యీ మిశ్రమాన్నో పెద్ద దోషంగా భావించక్కర్లేదు. ప్రయోక్తల మీద రచయితల మీదా స్టేజ్‌డ్రామా ప్రభావం బలంగా వుండడం వల్ల మన రాష్ట్రంలో వస్తున్న వీధినాటకాల్లో యీ మిశ్రమ లక్షణం యెక్కువగానే కనిపిస్తోంది. ఈవిషయాన్ని జనార్ధనరెడ్డిగారిలా మిగిలిన రచయిత ప్రయోక్తలు కూడా గుర్తించి బయటపడే ప్రయత్నం చేస్తే మన వీధినాటకాలు జవాన్ని జీవాన్ని యింకా పెంచుకుంటాయి.

ఈ మిశ్రమం యెంత మేరకి జరిగితే అంత మేరకి ప్రేక్షకుడు తన స్వీయ చైతన్యం ఆచరణకి రాకుండా నష్టపోతాడు. ఈ మిశ్రమంనుంచి యెంతగా బయటపడితే అంతగా ప్రేక్షకుడు పరిశీలకుడై అంతర్జాతీయ దృక్పథాన్ని పెంచుకుని స్వీయ నిర్ణయాలు తీసుకుని ఆచరించగల స్థాయికి యెదుగుతాడు. ఈ విషయాన్ని గుర్తించి బయటపడమనడం మినహా యిక లోతులికి నేను పోదల్చుకోలేదు. అంతిమంగా ప్రేక్షకుని చైతన్యమేకదా రచయితా ప్రయోక్తల ప్రయోగానికి లక్ష్యం.

వీధినాటకానికి 'మాంటేజ్' ప్రాణం. ఈ మాంటేజ్ సిస్టమ్‌లో యేదృశ్యానికి ఆ దృశ్యం స్వతంత్రమైంది గనుక యే కాలం నుంచి యే కాలానికైనా వెళ్ళవచ్చును. రచయిత భూస్వామ్యం నుంచి బ్రిటీష్ సామ్రాజ్యవాదవలసకి

ఓ గెంతు గెంతారు. మధ్యలో మహమ్మదీయ దండయాత్రలున్నాయి. మొగలాయీ పాలన వుంది. ఆ కాలంలో విద్యాసంస్కృతుల పరిణామం ఫలితాలూ మేవిటన్నది ప్రశ్నార్థకమేనా? లేక 'సలామయా' అని ప్లేటుఫిరాయించిన బ్రాహ్మణులు వాటిని వారి అదుపాజ్ఞల్లోనే వుంచుకున్నారని ఆ భాగాన్ని వదిలేశారా? వారి వుద్దేశ్యం తెలీడంలేదు.

తెల్లవాడి పాలనా కాలంలో ఓ సూచన మాత్రం గొప్పగా వుంది. గతంలో తిరుగులేని అధికారాన్ని చెలాయించిన గురుకుల ప్రతినిధి ఈ కాలంలో పూర్తి పరాధీన పరిస్థితిలో పడతాడు. ఆ అంతర్మథనం నుంచి జాతీయోద్యమానికి ప్రభావితుడవుతాడు. సీతారామరాజు లాంటి వారి త్యాగాలతో స్ఫూర్తిపొంది మార్క్సిస్ట్ విప్లవకారుడుగా (భగత్సింగ్‌గా) వురికంబం యెక్కుతాడు. చివర్లో ఈ దేశానికి స్వతంత్రం ఎంతలాలోచీగా వచ్చిందో సూచితమైంది. మళ్ళీ అదే మేధావివర్గం పరిస్థితులకు యెలా తలొంచిందీకూడా సూచితమైంది. ఈ ముగింపు చూస్తే ఆ మహమ్మదీయ కాలంకూడా సూచితమైవుంటే ఈ మేధావీవర్గపు పరిణామాత్మక (పతన) పరిణామంలో యింకో లింకు యొక్క రూపసారాలు బయట పడడానికి అవకాశంవుండేమో ననిపిస్తుంది. ఇది ఆ రచయితా ప్రయోక్త ఆలోచన కోసమేగాని దోషంగా యెత్తిచూపుతున్నది మాత్రం కాదు.

వర్తమాన భారత దేశపు విద్యా విధానాన్నీ దాని దుష్ఫలితాల్నీ వీధైనంత వివరంగానే చర్చించింది. కార్మిక కర్షక విద్యార్థి మేధావుల సంఘటిత పోరాటాలలో భాగంగానే వాటిని తొలగించుకుంటూ పోగలం అని సూచించింది. అందుకు సంసిద్ధంకమ్మని ప్రబోధించింది.

ఏ సాహిత్య కళాప్రక్రియకైనా 'ప్రబోధం' మంచి లక్షణమే. దాన్నెవరూ కాదనరు. ఒక విధంగా యిది (ఆరంభ కాలపు) అరిస్టోటిలియన్ రంగస్థల పరిమితి. ఓ ప్రక్రియని చూసినా చదివినా, అలాగే జీవితంలో ఓ దృశ్యాన్ని మనిషినీ చూసినా చదివినా అది చూసినవారిని చదివినవారిని ఆలోచింపజెయ్యాలి. ఆ స్వీయచైతన్యంవల్ల వారంతటవారే ఆచరణకి రావాలి. ఇది ఎపిక్ థియేటర్ అభివృద్ధి. లేదూ ఆ అభివృద్ధినింకా ముందుకి తీసుకుపోదల్చుకున్న వీధినాటకం విద్యకున్న అంతిమలక్ష్యం. ఆ లక్ష్యం చేరుకునే ప్రయత్నంలో వీలైనంత త్వరగా వీధినాటక రచయితా ప్రయోక్తలు (తెలుగుదేశంలో) ప్రబోధించడం దశ నుంచి ఆలోచింపచేసే దశకి యెదగాల్సివుంది. ఆ ఆచరణాత్మక ప్రయత్నాల వల్లే వీధినాటకం 'విద్య' అభివృద్ధిచెందుతుంది. ఆ సుదీర్ఘప్రమాణానికి వేస్తున్న తొలి అడుగుల్లో కాస్త బలమైన అడుగు జనార్ధనరెడ్డిగారి 'విద్య'.

# "అడవి నా రక్షణ కవచం"

—మానేపల్లి

**Poetry is written in language and therefore it is a book about the sources of languages. Language is a social product, the instrument whereby men communicate and persuade each other; thus the study of poetry's sources cannot be separated from the study of society.**

ఇవి **Christopher Coudwell (1907-1937)** రచించిన ప్రసిద్ధ గ్రంథం **Illusion and Reality** కి ప్రారంభంలోనే కనిపించే వాక్యాలు. కవిత్వం రచించబడేది భాషలోనే గనుక, భాషను మానవులు పరస్పరం భావ వ్యక్తీకరణకు ఉపయోగిస్తారు గనుక, భాషకు మూలం ఈ సమాజమే. అందు చేత కవిత్వమూలాల్ని అధ్యయనం చెయ్యడం అంటే సమాజాన్ని అధ్యయనం చెయ్యడమే.

కవిత్వమేకాని, కళ ఏదైనాగాని దానిమూలం ఉత్పత్తి సంబంధాల్లోనే వుంటుంది గనుక - కవిత్వాన్ని అధ్యయనం చెయ్యడం అంటే ఉత్పత్తి సంబంధాల్ని అధ్యయనం చెయ్యడమే.

ఈనాడు ఈ ఉత్పత్తిసంబంధాలపై ఫ్యూడల్ వ్యవస్థ తన పట్టును సాధించుకుంది గనుక, అర్థ భూస్వామ్య, అర్ధ వలస రాజ్యం ఏలుబడిలో వున్నది గనుక దాన్ని ఛేదించనిదే విముక్తిలేదు. ఈ కార్యక్రమం నిస్సందేహంగా విప్లవంద్వారానే సాధించాలి.

అందుకు జరిగే సాయుధ, సాంస్కృతిక పోరాటాలు ఒకదానితో ఒకటి పెనవేసుకుని సమాంతరంగా సాగవలసిందే. ఏదైనా ఆచరణలో నిగ్గుతేల వలసిందే.

విమల ఉద్యమంలోంచి కవిత్వంలోకొచ్చింది. ఉద్యమ అనివార్య అవసరంగా కవిత్వంలోకి వచ్చింది. అందువల్లనే ఆమెకి నిబద్ధత మాత్రమేకాదు అనివార్యంగా ఉండవలసిన నిమగ్నత కూడా ఉన్నది. ఆ కారణంచేతనే 'అడవి ఉప్పొంగినరాత్రి' సంకలనంలోని కవిత్వంనిండా చేవ ఉన్నది; అచ్చులో వచ్చిన మేరకు ఇది తొలి కవితాసంకలనమే అయినా ఏ పరిణత కవులకూ తీసిపోని చిక్కదనం వున్నది.

రాజ్యం పాలితులపై ప్రకటిత, అప్రకటిత హింసను ప్రయోగిస్తున్నది. భౌతికదాడితో భయభ్రాంతుల్ని చేస్తున్నది. కలాన్నేకాదు, మాటను సైతం నిర్బంధిస్తున్నది. దాన్ని ఛేదించాలి.

'మనుష్యులారా మాట్లాడండి
బిగ్గరగా గొంతెత్తి అరవండి
.... .... ...
వాడు మననుండి అన్నీ / అన్నీ గుంజేసుకున్నాడు.
చివరికి మన భావస్పందనలకు / వ్యక్తీకరణలకు
భాషలకు, శబ్దాలకు / చుట్టూతా వాడు
ప్రమాణాల కొలమానాల / ముళ్ళకంచెల్ని నాటాడు
మనుష్యుల్లారా / ముళ్ళ కంచెల్ని ధ్వంసంచేయండి'

ఇది భావిపై సాగుతున్న దాడి. ఛందస్సు, అలంకారం, వ్యాకరణం మొదలైన కృతకభావజాలపు ముసుగులో భాషపై విధిస్తున్న నిర్బంధం. భాష వాడి గూటిచిలకని చేసుకున్నాడు దాన్ని విముక్తం చేస్తే భాష స్వచ్ఛంగా సుందరంగా సమాజపరమౌతుంది. మాటలు "తలవంచని ఎర్రజెండాల్లా" విను వీధుల్లో సగర్వంగా ఎగురుతాయి.

ఈ సంకలనం పతాకశీర్షికగల కవితలో ప్రధానంగా కనపడే ప్రతీక 'అడవి'. ఈరోజు దీనిపై బోలెడు చర్చసాగుతోంది. మేధావులు తమ తెలివిని ఈ ఆలోచనపై సాగదీసుకుంటున్నారు. అడవి నిర్మానుష్యమని, పల్లెల్లో మాత్రమే ప్రజలు వున్నట్టు - ఈ పల్లెల్లో వుండే ప్రజలమధ్యన పనిచెయ్యవలసిన విప్లవకారులు ప్రజల్ని వదిలి అడవుల్లో తలదాచుకుంటున్నట్టు తమ భ్రమల్ని ప్రామాణిక పరిజ్ఞానంగా చలామణీ చేసుకుంటున్నారు. ఉద్యమ అవసరంగా అడవుల్లో, అజ్ఞాతంగా సాగుతున్న ప్రచ్ఛన్న పోరాటంపై బురద చల్లుతున్నారు. అలా చేసి వాళ్ళు తమ వెధవాయిత్వాన్ని మాత్రమే చాటుకుంటున్నారు.

"అమరవీరులు అడవిలో ఎన్నటికీ / వాడిపోని మొక్కలు
జనసముద్రానికి / శ్వాస అడవి ....
ఇప్పుడు అడవి సముద్రంలా / ఉప్పొంగుతోంది
చెట్లు అలలు / మైదానాల్ని తాకుతున్నాయి
అడవి నా రక్షణ కవచం / ఆయుధం నా దిక్సూచి"

ఇదీ అడవి వాస్తవచిత్రం. అడవిపట్ల విప్లవకారులు పెంచుకోవలసిన దృక్పథం. అడవి తల్లిపడి, అడవిలో శబ్దాన్ని చూడడం నేర్చుకోవాలి.

'సెప్టెంబర్ మూడు' ఈ సంకలనంలోని గొప్ప కవితల్లో ఒకటి. 1985 సెప్టెంబర్ 3న ఆంధ్రప్రదేశ్‌లోని ఒక నగరం వరంగల్ నడిబొడ్డున రాజ్యాంగానికి కుడిభుజం నిస్సిగ్గుగా చేసిన ఒక కిరాతకం. తన నగ్నస్వరూపాన్ని చాటుకుంది. సివిల్‌దుస్తుల్లో సాగిన ఒక పోలీసు శవ ఊరేగింపు ప్రజావైద్యుడు డా॥ రామనాధంగార్ని ఆయన క్లినిక్‌లోనే బహిరంగంగా హత్యచేసింది. నాగరిక సమాజం యావత్తూ మౌనసాక్షిగా నిలిచింది ఈ 'అనాగరికచర్య'కు. అదే రోజు యాదృచ్ఛికంగా ఢిల్లీలో నిర్బంధ వ్యతిరేకదినం [Movement Against Repression] జరిగింది. దీనివెనక వుండే Natural Irony మన గుండె బరువెక్కిస్తుంది. సుమారు ఒక ఏడాది తరువాత 1986 నవంబర్ ఏడున పౌర హక్కులసంఘం ఉపాధ్యక్షుడు జాపా లక్ష్మారెడ్డిగార్ని సివిల్‌దుస్తుల్లో వచ్చిన ఒక రివాల్వర్ తెల్లవారుజామున చీకటిముసుగులో తలుపుతట్టి మరీ బయటికి పిల్చి మరీ కాల్చేసింది. తారీకులు ఏవైనా సెప్టెంబర్ మూడులు పౌరజీవితాన్ని కాటువేశాయి. రాజ్యాంగం సాక్షిగా ఇచ్చిన నామమాత్రపు పౌరహక్కుల్నికూడా ఈ అతిపెద్ద ప్రజాస్వామ్యదేశం, ఈ దేశాన్నేలే పాలకవర్గాలు కాలరాశాయి. గోముఖం తగిలించుకున్న వ్యాఘ్రం - నేరుగా నడిరోడ్డుకెక్కి కరాళనృత్యం ప్రారంభించింది. రక్తదాహం రాజ్యమేలింది.

'సెప్టెంబర్ మూడుల పునరావృతాన్ని / సమాధిచెయ్యందే
నల్లటి చిత్రాలవెనక విషాదాన్ని / సమాధి చెయ్యందే
మరెవ్వరం మిగలం'

మరి 1984 అక్టోబర్ 31 నాటి, ఆ మరునాళ్ళ సంఘటనలు వేరుకావు. అప్పుడు జరిగిందీ ప్రజారక్తతర్పణమే. "దేశ్‌కీ నేతా" దేహాన్ని పీనుగులవెంట చేసిగాని కదల్లేదు. ఎమర్జెన్సీ క్రూరవిషాదాన్ని, టర్క్‌మన్‌గేట్ దురంతాల్ని మౌనంగా భరించిన 'ఓటర్లు' - ఇందిరమ్మని గద్దె దింపారు తొలిసారి. పార్టీలే మార్పుగాని పాలకనీతి ఒక్కటేగనక జనతాపార్టీ పదవుల కుమ్ములాటలో తల పగిలి చచ్చింది. ఆ రాజకీయశవంపై లేచిన జిల్లేడులా మళ్ళీ గద్దెమీదికి పాకింది ఇందిరావిషసర్పం. స్వప్రయోజనాలకోసం 'ఆపరేషన్ బ్లూస్టార్' విషం కక్కింది. ఈసారి 'ఓటర్ల'కు మరో గత్యంతరం మిగల్లేదు. సర్పం తల ఛేదించక తప్పలేదు. అది రాచపీనుగ. తోడులేకుండే వెళ్ళదట. వేలాదిమందిని వెంట

పెట్టుకుపోయింది దేశాన్ని పాలించిన భయంకర నియంత శవంకూడా బలితీసు కుంది. వారసత్వపాలన ప్రజాస్వామ్యముసుగులో మళ్ళీ దేశంమీదికి వాలింది. ఆ మారణహోమంలోంచే 'బిస్టర్ క్రీన్' ఉద్భవించాడు. ఈ డర్టీస్టోరీ ఎందరో తల్లుల్ని ఘోరనరకంలో ముంచింది. ఈ చిత్రమే 'కన్నతల్లి'లో లార్జ్ కాన్వాస్ లో కనపడుతుంది.

"నీకు నిన్నే శత్రువును చేసే కుట్ర ఇది
మనవేళ్ళతో మనకళ్ళనే పొడిచే నీతి ఇది
రెండు ఆకటి కడుపుల మధ్య పెట్టే చిచ్చు ఇది
ఈ మంటన చలికాగేది
రాజ్యమూ, దాని 'రాజులైన' రాజీవులేనయ్యా!"

-అంటుంది తల్లి. ఆ తల్లి పడిన బాధ, భరించిన నరకం అంతాయింతా కాదు. ఆకాశమే హద్దు చదవడానికి కూడా ఏహ్యమైన భయంకర దృశ్యం ఇది. ఆ తల్లి ఆక్రోశం ఇది -

సూర్యుడా! పట్టపగలు
ఎంత సిగ్గులేకుండా వెలుగుతున్నావయ్యా నువ్వు....
బాబులూ - నా బిడ్డలారా!
వినండిరా! వినండి / ఒక్క సంగతి ...
ఇదే మార్గాన, ఇదే ఘార్గాన
మీకు జన్మనిచ్చిన తల్లినిరా నేను
తొమ్మిది నెలలు / మిమ్మల్ని కడుపున మోసిన
కన్నతల్లినిరా నేను
ఏ స్తన్యాన్నయితే మీరు
కండకావరంతో, కావరంతో రక్తసిక్తంచేశారో
ఆ స్తన్యం త్రాపి, అద్దాల్లో బిడ్డలుగా
కంటికిరెప్పల్లా సాకిన అమ్మనురా నేను

తల్లిని జన్మనిచ్చిన మాతృమూర్తిగాకాక, ఒక స్త్రీగా, ఒక 'వస్తువు'గా చూసే సంస్కృతిని పెంచిపోషించింది ఈ వ్యవస్థ. దానికి తాను బలిఅయినా ఆ వ్యవస్థనే కాపాడింది ఇందిరామాయా! మరణించిన విధానం మనిషిని పట్టిస్తుం దన్న నగ్నసత్యాన్ని మరోసారి ఋజువుచేసి బుల్లెట్లుతిని చచ్చిన క్రూరమృగం!

కవయిత్రిగా విమల పదునెక్కిన అవగాహనతో రాసిన కవితలు ఈనాడు పక్కదారిపడుతున్న కొన్ని ఫెమినిస్టువర్గాలకు స్పష్టమైన ప్రత్యామ్నాయ మార్గాన్ని సూచిస్తున్నాయి.

తెగిపడిన మా కలల ప్రపంచం, వంటిల్లు, వేశ్యాశిశువు, సౌందర్యశిశువు ఈ నాలుగు కవితలూ స్త్రీని మార్క్సిస్టు దృక్పథంలో ఎట్లా అర్థంచేసుకోవాలో చూపుతాయి. స్త్రీని 'ఓ పునరుత్పత్తి పరికరమా!' అని సంబోధించడం ప్రారంభించి 'ఓ! నా మిగిలిన సగం ఆకాశమా!' అని పిలుస్తూ మెరుపుల పిడికిళ్లెత్తి, పోరాట ప్రచండ ఘోషను వినిపించమంటుంది. వంటిల్లు కవితలో వ్యంగ్య చిత్రణ, స్పష్టత, కవిత్వీకరణ మరింత పదునెక్కాయి. ఆడపిల్లకు చిన్నప్పటి ఆటల్లోకూడా వంటిల్లే -

'పప్పుబెల్లాల్తో ఉత్తుత్తి వంటావడ్డనలు
అమ్మా నాన్న ఆటలు
ఈ వంటిల్లొక వదలని మోహమై
నా బాల్యాన్నంతా చుట్టేసుకుంది'
.... ... ....
మా అమ్మొక ప్రేతంలా తేలుతూ వుంటుందిక్కడ
అసలు మా అమ్మే నడుస్తున్న వంటగదిలా వుంటుంది
... ... ...
ఈ వంటింటి సామ్రాజ్యానికి మా అమ్మే రాణి
అయినా, చివరకు వంటింటి గిన్నెలన్నిటిపైనా
మా నాన్న పేరే!

వంటింటి అమానుషత్వం ఎలా స్త్రీని సర్వాంగాల్లోనూ దోపిడీచేస్తుందో అర్థంచేసుకుంటున్నకొద్దీ ఆ వంటింటి స్వరూపాన్నే ధ్వంసంచెయ్యాలన్న ఆలోచన అనివార్యంగా తన్నుకొస్తుంది. స్త్రీ వంటింటికి బానిసై కడిగిందే కడిగి ఏళ్ళతరబడి వండీ వార్చీ వడ్డిస్తూ, ఎంగిలెత్తుకుంటూ చివరకు కలల్లోకూడా వంటిల్లే అయ్యే భయంకర జీవితం గడుపుతుంది. 'మల్లెపూవుల్లోనూ పోపు వాసనలే!'

'మనరక్తం పీల్చేసి, మన ఆశల్నీ కలల్నీ కాజేసి
కొద్దికొద్దిగా జీవితాంతం పీక్కుతింటున్న

రాకాసి గద్ద ఈ వంటిల్లు
.... ... ఈ వంటిళ్ళను / ధ్వంసంచేద్దాం రండి
... ...
పునాదులతోసహా తవ్విపోద్దాం రండి!
మళ్ళీ మన పాపలు ఈ వంటరి వంటిళ్ళలోకి
అడుగిడబోతున్నారు
మన పిల్లలకోసం / వంటరి వంటగదులు కూల్చేందుకు రండి

వంటరి వంటగదులు కూల్చేందుకు రమ్మన్న పిలుపులోనే సామూహిక, సామాజిక వంటశాలల అవసరాన్ని గుర్తుచేస్తున్నది కవయిత్రి. సామాజిక వంటశాలలు సోషలిస్టువ్యవస్థలో తప్ప సాధ్యంకాదు గనుక ఆ సోషలిస్టువ్యవస్థ దిశగా మహిళాఉద్యమం సాగాలన్న కర్తవ్యబోధకూడా ఈ వాక్యాల వెనక వున్నది.

పురుషప్రపంచం స్త్రీలకు తొడిగిన బంధాలు క్రమంగా నాగరిక ప్రపంచంలో అందమైన అలంకారాలై లోలకులు, కంఠాభరణాలు, కరకంకణాలుగా మారి కళ్ళను మోసంచేసి కళాపోషణగా ముందుకొచ్చాయి. బంధాల్నిసైతం సరుకునుచేసి వ్యాపారంచేసుకునే పైశాచిక పురుష ప్రపంచం ఇది. ఈ దోపిడీ వ్యవస్థ స్త్రీని 'దిష్టిబొమ్మ'గా 'ఈజిప్షియన్ మమ్మీ'గా, ఆఖరికి తన దేహంపై కూడా తనకు అధికారం, హక్కు లేకుండా చేసి, ఆమెని కేవలం 'సరుకు'గా మార్చేస్తుంటే - ద్వేషించక తప్పదు. తిరుగుబాటు ప్రకటించక తప్పదు 'కృత్రిమసౌందర్యకాంక్ష'ను కూకటివేళ్ళతో పెకలించకతప్పదు. 'ఏ అలంకారాలు, ఏ సౌందర్య కొలబద్దలు లేని జీవితాన్ని' పిలవకతప్పదు.

అందుకే స్త్రీలోకానికి ఈ పిలుపుతప్పదు -
'శ్రమసౌందర్యాన్ని, మానవ విలువల్ని ప్రేమిద్దాం!
అందరికోసం అద్భుతసౌందర్యాన్ని
సహజసౌందర్యభరిత ప్రపంచాన్ని సృష్టిద్దాం'

స్త్రీ జీవితంలో మరో భయంకరకోణం 'వేశ్యబ్రతుకు'. మగవాడి భోగలాలసత స్త్రీ పాలిటి మృత్యుగీతం. తల్లికి వేశ్యముద్ర. ఆమె కన్నబిడ్డ 'వేశ్యాశిశువు'. ఆ పసికందుది 'రెక్కలువిరిచేయబడ్డ బాల్యం' 'శిథిలమయ్యే శైశవం'. కనుకనే ఆ వ్యథార్తజీవిత యథార్థదృశ్యాన్ని చూసి చలించి -

"తల్లీ! నీ పాలబుగ్గలపై
గడ్డకట్టిన కన్నీటి చారికల్ని శాశ్వతంగా తుడిచేసేందుకు

# విరసం విశేషాలు

## "కాలం చెల్లింది కమ్యూనిజానికా? రివిజనిజానికా?"

విరసం కృష్ణాజిల్లా యూనిట్ 22-3-90న విజయవాడలో పై అంశంపైన ఏర్పాటుచేసిన బహిరంగసభలో డా॥ బాలగోపాల్ ప్రసంగిస్తూ, కేవలం ఆర్థిక అసమానతలను అంతంచేయడం వల్లనే సంపూర్ణమైన సోషలిస్టువ్యవస్థ ఏర్పడదనీ, అన్నిరకాల అసమానతలను సమూలంగా నిర్మూలించడమే సోషలిజం అంతిమ లక్ష్యమనీ అన్నారు. అయితే అన్ని అసమానతలకూ మూలం ఆస్తి అని భావించి ఆస్తిని సమాజపరంచేసి ఆర్థిక సమానత్వం లక్ష్యంగా కొన్ని సోషలిస్టుదేశాలు ఆవిర్భవించాయనీ, ఆస్తిమీద వ్యక్తుల పెత్తనం పోయినప్పటికీ వేలాది సంవత్సరాలుగా సంక్రమించిన ఇతర అసమానతలు తొలగిపోలేదనీ, స్త్రీ మీద పురుషుడి ఆధిపత్యం, గ్రామాలమీద పట్టణాల ఆధిపత్యం, కార్మికుల మీద మేధావుల ఆధిపత్యం వంటి ఆధిపత్యాలను తొలగించుకోవడానికి సోవియట్ రష్యా ఎలాంటి ప్రయత్నమూ చేయలేదనీ, చైనాలో మావో నాయకత్వాన 'సాంస్కృతిక విప్లవం' పేరుతో ఈ ప్రయత్నం కొంత జరిగిందనీ, ఆయన అన్నారు. పేద మధ్య తరగతులు రైతుల ఇష్టాయిష్టాలలో ప్రమేయం లేకుండా

---

మేము ఎన్నెన్ని నిప్పులసముద్రాలన్నయినా ఎదురీదుతాము!
ఈ శిశుహంతకుల అంతంకై
ఈ నేలన ఎంతరక్తాన్నయినా ధారపోస్తాముకన్నా!
నీ పెదవులపై నవ్వుల్ని పండించేందుకు
ప్రాణమిస్తాంరా! ప్రాణం!" అంటోంది కవయిత్రి.

విప్లవకారుడు నిరంతర ప్రేమికుడనేందుకు ఈ వాక్యాలు ప్రబలసాక్ష్యం.

ఇవి గత పదేళ్లగా వివిధ పత్రికల్లో వచ్చిన కవితలే. ఒక్కచోట చేరేసరికి ఇంత బలాన్ని కూర్చుకున్నాయి.

కవిత్వం మనకి ఆయుధాల్నిచ్చి / భుజంతట్టి యుద్ధభూమికి పంపుతుంది. మనల్ని మానవులుగా నిలబెడుతుంది. అందుకే ఈ జీవన కవిత్వంపై ప్రేమతో జీవిద్దాము. జీవితాన్ని ఉద్యమానికి మీదు కడదాం.

[అడవి ఉప్పొంగినరాత్రి - విమల కవితా సంకలనం - జనవరి 1990- విరసం సిటీయూనిట్ ప్రచురణ. 107 పేజీలు. వెల: ఆరు రూపాయలు.]

భూసంస్కరణలు జరిపి త్వరితగతిన పారిశ్రామికాభివృద్ధి సాధించాలనే దృక్పథంతో ఉన్నందువల్ల స్టాలిన్ ప్రజల అసంతృప్తికి గురయ్యాడనీ, 1956లో కృశ్చేవ్ రష్యా ఆర్థిక పరిస్థితిని అంచనావేసేనాటికి పెట్టుబడి ఉత్పాదకత పెరుగుతున్నట్టుగా శ్రమ ఉత్పాదకత పెరగలేదనీ, పెట్టుబడిదారీవ్యవస్థల్లో శ్రామికులచేత పని ఎక్కువగా చేయించడానికి ఏవి ఎరగా వేస్తారో, వాటినే ఎరగా వేసే విధానం గోర్బచేవ్‌కాలం నాటికి ముదిరి పాకానపడిందనీ బాలగోపాల్ అన్నారు. తూర్పుయూరప్ దేశాల్లో కూడా ఇంచుమించు ఇలాగే జరిగిందనీ, చివరకు ప్రజలకు సమాధానం చెప్పుకోలేని పరిస్థితిలో అక్కడి ప్రభుత్వాలు పడిపోయాయనీ వివరించారు.

ఈ సభకు విరసం సభ్యుడు కా॥ ఎన్. వేణుగోపాల్ అధ్యక్షత వహించారు. సభానంతరం జననాట్యమండలి సాంస్కృతిక ప్రదర్శనలిచ్చింది.

## విరసం నెల్లూరు యూనిట్ 'వాల్ పొయిట్రీ'

ఇదివరకు కరపత్ర సాహిత్యంద్వారా ఒక కొత్త ఒరవడిని సృష్టించిన నెల్లూరు యూనిట్ ఇటీవల మరో కొత్త రూపాన్ని అనుసరిస్తోంది. అదే వాల్ పొయిట్రీ. వచనకవితకు పాఠకులు తక్కువగా ఉంటారని సాధారణంగా అనుకుంటాం. అది నిజం కూడా. కానీ అదే వచన కవితను సందర్భానుసారంగా గోడపైన రాసినప్పుడు, లేదా పోస్టర్‌లో రాసి గోడకు అంటించినప్పుడు దాని పాఠకులు మాత్రం తక్కువగాదు. పత్రికల్లో, పుస్తకాల్లో చదవడానికి ఇష్టపడని వాళ్ళు కూడా గోడపైన కవిత్వాన్ని రాస్తే చదవడానికి ప్రయత్నిస్తారు. ఇటీవల నెల్లూరు యూనిట్ నెల్లూర్లో వేసిన వాల్‌పొయిట్రి దీన్ని రుజువుచేసింది. ఖర్చు తక్కువ. మంచి రెస్పాన్స్.

మార్చి 8న అంతర్జాతీయ మహిళా దినోత్సవం సందర్భంగా నెల్లూరు యూనిట్ విరసం సభ్యుడు కోలపూడి ప్రసాద్

"రైలుబండంతా కదలకుండా బోగీమాత్రమే కదలదు
భూవిముక్తి జరగకుండా స్త్రీ విముక్తి జరగదు
అందుకనే నా చెల్లీ!
అడవి అన్నలతో చేయికలుపు
అపుడేనమ్మా నీ బతుకున పొద్దుపొడుపు"

అంటూ వాల్‌పొయిట్రీ రాశాడు.

మార్చి 11 వ తేదీన నెల్లూర్లో పెంపుడు కుక్కల ప్రదర్శన జరిగింది. జిల్లా కలెక్టర్ దాన్ని ప్రారంభించాడు. ఆరోజు ఆ ప్రదర్శన గేటు దగ్గర నెల్లూరు యూనిట్ విరసం సభ్యులు కోలపూడి ప్రసాద్ రాసిన కవితను గోడపై అంటించారు. ఆ కవితలో కొన్ని చరణాలు ఇవి :

"మనం మనుషులం
చూసే కళ్ళూ, ప్రశ్నించే నోరూ,
ఆలోచించే మెదడూ వున్న మానవులం
అయినా- మనలో కొద్ది మంది
కుక్కల్ని ప్రేమించినంతగా మనుషుల్ని ప్రేమించరు
.... ... ...
మనుషుల్ని చంపి కుక్కల్ని పోషిస్తున్నారిక్కడ
.... ... ...
ఈ కుక్కజాతి నాయకుల్ని కుర్చీలకెక్కిస్తున్నాం"

ఆ ప్రదర్శనకు వెళ్ళేవారు ఎవరూ ఈ కవితను చదవకుండా లోపలకి వెళ్ళలేదు. ఈ రూపాన్ని ఇంకా బలంగా మనం ఉపయోగించుకోవచ్చు.

* * *

మార్చి 14 కారల్‌మార్క్స్ వర్థంతి సందర్భంగా విప్లవ రచయితల సంఘం గుంటూరు జిల్లా యూనిట్ విప్లవ కార్మిక సమాఖ్య, జనచైతన్య వేదిక లతో కలిసి గుంటూరులో నిర్వహించిన సభలో విరసం కార్యవర్గ సభ్యుడు కా॥ C.S R. ప్రసాద్ ప్రసంగించారు. మార్చి 23 న భగత్‌సింగ్ వర్థంతి సందర్భంగా విరసం గుంటూరు యూనిట్ పై సంస్థలతోనూ, రాడికల్ విద్యార్థి యువజనసమాఖ్యతోనూ కలిసి కాగడాల ప్రదర్శన జరిపింది. ఈ ప్రదర్శనలో 200 మంది పాల్గొన్నారు. ప్రదర్శన అనంతరం అంబేద్కర్ విగ్రహం వద్ద సభ జరిగింది.

---

## నేనుం

ఒరేయ్ శత్రువూ!
నేను జనాన్ని
పీడితజన సర్వస్వాన్ని
నీ సంస్కృతికీ, నీకూ గుండెల్లో గునపాన్ని
రెండు పదుల ప్రాయంలో
పొంగులెత్తు విరసాన్ని

—పద్మశ్రీ

# ఎన్నాండ్లు ఈ ఎట్టి బతుకులు

ఎన్నాండ్లు ఈ ఎట్టి బతుకులు
ఎదురుతిరుగరోరన్నా - నువ్ బెదిరిపోకురోరన్నా-

దుక్కులు దున్ని మొక్కలు నాటిన
నీ రెక్కలకు సుక మేదన్నా - నీ డొక్కలో మెతుకేదన్నా

మొక్కరాని దేవుండ్లకు మొక్కితె
నీ చిక్కులు దీరలేదన్నా - నీ చింతలు దీరలేదన్నా-

బతుకె భూమై భూమె బతుకై
బతుకు బతికితివిరన్నా - నీకు భూమి లేదాయన్న-

నాగలి కఱ్ఱ పారవు నీపై
పనిముట్లయితివిరన్నా - నీ పలితమే గుండుసున్న

దొరతనము దొరజులుమును దున్న
నాగలి గట్టండన్నా- భరె నడుములు గట్టండన్నా-

దున్నెవానికి భూమిదక్కాలి!
పోరాడేవానిదే ఎఱ్ఱజెండా!!

—గద్దర్

---

(60 వ పేజి తరువాయి)

అప్పుడు గడ్డకట్టిన మంచుపర్వతాలు కరిగిపోతాయి
నదులు పొంగి పొర్లెత్తి ప్రవహిస్తాయి
వేయి సూర్యులను ఆవిష్కరిస్తూ ఈ భూమిని పునీతం చేస్తాయి
పిచ్చి ఆకాశమా! కన్నీళ్లకిది కాలం కాదు
మండుతున్న సూర్యుల్ని ఒకచోట చేర్చి
ఆగ్రహించు, అగ్నిని కురిపించు
వసంత మేఘ గర్జనలను ధరించు, తిమిర రేఖలను సంహరించు.

118 ARUNA TARA MARCH 1990 H GTR-70
Annual Subscription Rs. 30/- Single Issue Rs. 3/-

# మార్చ్ 14

—వహౌనిక్



మార్చి 14 మార్క్స్ వర్ధంతి

ఈరోజు విన్ను తల్పుకొని
పిచ్చి ఆకాశం కన్నీళ్ళు పెట్టుకుంటోంది
కాకస్ పర్వతాలపై
మంచు ఘనీభవించిందని
యాంగ్సీనది ఎండిపోయిందని
తూరుపుపై పశ్చిమాద్రి చీకటి
పరుచుకుందని
పాపం పిచ్చి ఆకాశం
కన్నీళ్లు పెట్టుకుంటోంది!
ఆకాశం కంటినుండి నీటిచుక్క తెగి నేలపై పడగానే
బుసబుసమని పొంగుతూ వీరుల రక్తం ఇంకి బీళ్ళు బావురుమంటున్నాయి
గడ్డిపోచలను నిమురుకుంటూ, పీచువేళ్ళను ఓదార్చుకుంటూ,
ఈ నేల పొరలుపొరలు కుళ్ళగించుకొని కుమిలిపోతూ
బీళ్ళలో కన్నీళ్ళ సెలయేళ్ళు ప్రవహిస్తున్నాయి.
ఎంతకాలం ఎన్ని కన్నీళ్ళు ప్రవహించినా
ఎండిన యాంగ్సీ ప్రవహించదు, ఘనీభవించిన పర్వతాలు కరగవు
పశ్చిమాద్రి చీకటి గుండెలో వెలుగురేఖలు విచ్చుకోవు
కాలం కదనుతొక్కుతూ కదలిరావాలి.
కటికచీకటిని ఛేదిస్తూ సూర్యుడుదయించాలి
ఈ భూమి సలసల కాగి ఆవిరి దిగంతాలకు వ్యాపించాలి
అడవులు తలయెత్తి మేఘాల మెడలువంచి నేలకు దించాలి

(కొరవ 59వ పేజీలో)

Printed at Konarka Printers, Kavali on behalf of Venkataramana Printers, Guntur-1. Revolutionary Writers' Association



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA101M104 |
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 08 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 61 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Sumathi |
| పేజీలు విడదీసినది | bhanu sree |
| స్కాన్ చేసినది | akshaya |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |